సటీకాంధ్ర శబ్దచింతామణి.
(౯)

అంబటికి - అంబటినీళ్లు - నేయి - నేతికి నేతికుండ మిఱ్ఱు మిఱ్ఱికి మిఱ్ఱిచేను. కన్ను - కంటికి, కంటితుద. గొడ్డలి గొడ్డంటికి - గొడ్డంటి విస్స. ముల్లు - ముంటికి. ముల్లుకంప. మిన్ను మింటికి. మిన్నేఱు. పుడిసెడు. పుడిసెటికి. పుడిసెడునీళ్లు, పాము - పామునకు. పాఁప ఱేఁడు - వేము - వేమునకు - వేఁపచెట్టు కొన్నియెడల-సమాసవిభక్తుల రెంటను గలుగవు. ఉ, పైరు పైరునకు - పైరుజొంపము - కల్లు - కల్లునకు - కల్లుకుండ - ఎన్ను ఎన్నునకు - ఎన్నుగంట - ఇత్యాద్యుదాహార్యంబులు.

౭౦॥ సూ॥ వాంతాస్మదో ర్ద్రుతస్య స్యాద్లుక్ ॥టీక॥

అన్మాస్మదోః - తాను నేనుల యొక్క - ద్రుతస్య నకారమునకు. లుక్ లోపము - వా - వికల్పము గా - స్యాత్ - అగును। అనఁగా-సరళ స్థిరవర్ణంబులు పరములగునపుడు-సలోలోశ్చ యను వక్ష్యమాణ సూత్రంబునంద

లిచకారమువలన నకారమునకు వైకల్పికముగా లో పముగాఁగానిగిల్చిన తాఁ - నేఁ - అనుశబ్దముల న కారమునకు లోపము వికల్పముగా నగునని తాత్పర్య ము ॥ఉ॥ తాఘనుఁడు, తాఁఘనుఁడు. తాను ఘనుఁ డు. నేఁరింకి, నేఁరింకి. నేను రింకి - ఇత్యాదులు. ఈసూత్రారంభము చేతలు గ్వాప్రతేత్యాదిసూత్రంబ నిత్యంబని తోఁచుచున్నది ' దానివలన బ్రామ్హ ననము ఇత్యాదులందా సూత్రము ప్రవర్తింపదు.

౪౧ ॥మూ॥ వాక్యాన్తగతపదానాంచ ॥టీక॥ వా క్యాన్తగతపదానాంచ - వాక్య - వాక్యముల యొక్క - అన్త. అవసానమును - గత - పొందిన - పదానాంచ - ప దముల యొక్కయు. ప్రమతస్య - నకారమునకు - లుక్. లోపము - వా. వికల్పముగా - స్యాత్. అగును అ నఁగా వాక్యంబులతుదినుండెడిపదంబులనకారంబున కు లోపము వికల్పముగానగునని తాత్పర్యము ॥ వాక్య మనఁగానేక క్రియాన్వితపదసమూహమును పద్య

పాడంబును ఉ. ఊసంట్రూయె అతంట్రూయెర్ -
అలరెనెత్తావికేళీవనాగ్రసీమ - సాత్యవతేయుఁగొల్చె
దర్. ఇత్యాదులు -

౪౨ ||మూ|| నలడాదేరంతస్యతశ్చ ||టీక|| అన్త్యః - న
డుమనుండెడి - నలడాదేః - నకారలకారడకారంబులు
మొదలు గాఁగలవర్ణముకంటెఁబరంబయిన - ఉతశ్చ -
ఉకారమునకును - లుక్ - లోపము. వా|| వికల్పముగా -
స్యాత్ - అగును। అనఁగాఁబదంబులనడుమనుండెడు
నలడాదివర్ణంబుకంటెఁబరంబగును కాగమునకులోప
మువికల్పముగానగుననితాత్పర్యము - ఉ. పునుక. పు
న్క. కినుక. కిన్క. మినుకులు. మిన్కులు. చిలుక. చి
ల్క. పల్కులు. కడుపు. కడ్పు. ఆదిశబ్దము చేత - ము
రువు. ముర్వు. దొరువు. దొర్వు. కాలుపోతు. కా
ల్పోతు. ఇత్యాదులూహ్యంబులు,

౪౩ ||మూ|| అన్యేషాం ప్రయోగముహితానామ్ ||టీ
క|| ప్రయోగముహితానామ్. ప్రయోగ. ప్రయోగ

ము చేత. మహితానామ్. పూజ్యములగు. అన్యేషాం చ ఇతరములగునచ్చులకును. లుక్, లోపము. వా. కల్పముగా. స్యాత్. అగును| అనఁగానలడాకుల కంటెఁ బరములగు పెఱయచ్చులకును బ్రామాణికప్రయోగంబులుగలయెడలలోపంబువికల్పంబుగానగునని తాత్పర్యము ఉ ఉనికి. ఉన్కి. కలికి కల్కి. బుడిపి, బుడ్పి. ఉంగరము ఉంగ్రము, ఇత్యాదులూహ్యంబులు। ప్రయోగమహితానామనుటవలన తలియ. గద్దియ సామర. ముంగల. ఇత్యాదులయందులోపంబుగలుగదు ఈ ప్రయోగమహితత్వవిశేషణంబు పూర్వసూత్రంబునందునుగ్రహింపవలయుదానివలన పనుఁగు- అడుగు-మడుఁగు వడుగు ఇత్యాదులయందులోపంబుగలుగదు,

౭౭ ॥సూ॥ ఇతి శ్రీసకలభాషావాగనుశాసననన్నయభట్టవిరచితాంధ్రశబ్దచింతామణౌద్వితీయస్సంధిపరి

చ్ఛేదః ॥టీక॥ ఇది శ్రీసకలభాషావాగనుశాసనుండగు నన్నయభట్టారకుచేత విరచింపఁబడిన యాంధ్రశబ్దచింతామణి యందు రెండవదియైన సంజ్ఞాపరిచ్ఛేదము, ముగిసె.

---

## అజంతపరిచ్ఛేదము,

---

౧ ॥ మూ ॥ డుమువులవః ప్రథమాస్యాత్ ॥ టీక ॥ డుమువులవః. డుమువులు అనునవి. ప్రథమా, ప్రథమావిభక్తిః స్యాత్. అగును అనఁగా - డు- ము. వు. లు- అనువర్ణకములు ప్రథమావిభక్తులని తాత్పర్యము.

౨ ॥ మూ ॥ కూర్చిలనునయోర్భవేద్ద్వితీయాతు ॥ టీ ॥ ద్వితీయాతు ద్వితీయా విభక్తియైతే కూర్చిలనునయోః కూర్చి ల. ను. ని అనునవి భవేత్ - అగును- అనఁగాఁ గూర్చి ల ను ని అనువర్ణకములు ద్వితీయా విభక్తులని తాత్పర్యము.

౩ ॥ మూ ॥ తో చేతతోడ చేవత్తృ యాయాః ॥ టీక॥ తృతీయాయాః తృతీయావిభక్తికి తో చేతతోడచేచ తో చేత తోడ చే అనునవి-స్యుః అగును। అనఁగాఁదో చేత-తోడ చే అను వర్ణకములు తృతీయావిభక్తులని తాత్పర్యము

౪ ॥ మూ ॥ కొఱకుకయి చతుర్థ్యాస్స్యుః ॥ టీక॥ చతుర్థ్యాః - చతుర్థీ భక్తికి కొఱకుకయి కొఱకు కయి. అనునవి స్యుః. అగుచున్నవి అనఁగాఁ గొఱకు- కయి అనువర్ణకములు చతుర్థీవిభక్తులని తాత్పర్యము.

౫ ॥ మూ ॥ పట్టివలనకంటెఃఇతి ఞ్చమీ ॥ టీక ॥ పట్టివలనకంటేఃఇతి పట్టి వలన కంటేః అని పఞ్చమీ సంమీ-విభక్తి స్యాత్ అగును। అనఁగాఁబట్టి-వలన ,కంటె అనువర్ణకములు పంచమీవిభక్తులని తాత్పర్యము.

౬॥ అథలోపలకికుయొక్కాన్యా॥టీక॥ అథ - పిమ్మట లోపలకికుయొక్కాన్యా - లోపల కి కు - యొక్క అనునవి - అన్యా - ఇతరమైనవిభక్తి అనఁగాషష్ఠీవిభక్తి - స్యాత్ - అగును అనఁగా లోపల - కి - కు.

యొక్క - అనువర్ణకములు సప్తమీవిభక్తులని తాత్పర్యము

౭॥ మూ॥ అంచిందు నాస్తు సప్తమీ॥ టీక॥ అంచిందు నాస్తు - అంచు - ఇందు - న - అనునివి నైతే - సప్తమీ - సప్తమీవిభక్తి. స్యాత్ - అగును। అనఁగా అంచు. ఇంచు - న - అనువర్ణకములు సప్తమీవిభక్తులని తాత్పర్యము.

౮॥ మూ॥ ఓయీత్యామన్త్రణంచ వికృతౌ స్యాత్

టీక॥ వికృతౌ - ఆంధ్రభాషయందు ఆమన్త్రణంచ - సంబోధనమును - ఓయీతి - ఓయి యని - స్యాత్ అగును। అనఁగా నాంధ్రభాషయందు సంబోధనంబోయి పదంబు చేసగునని తాత్పర్యము। ఈయోయి పదంబునం దలి యివర్ణమునకు మహదాహ్వానంబునందు వికల్పముగా నమహదాహ్వానంబున నిత్యంబుగా లోపంబు గలుగు - నీచత్వమిశ్రత్వంబు లర్థంబగునపుడు పుంవాచకంబున - రి - అనియు స్త్రీవాచకంబున - సి - అనియు నాదేశంబులగు - ఉ. ఓయి రాముఁడ. ఓ రాముఁడ ఓ చెలి. ఓమృగమ. ఓవనమ. ఓరి దురాత్మ. ఓరి చెలికాఁ

ఉ. ఓసిమరాత్ము గాల. ఓసిచెలి ఇత్యాదులు.

౯ ॥సూ॥ స్త్రీ పశుజడాన్ వినాన్యే మహదాఖ్యాః॥ టీ

స్త్రీపశుజడాన్ - స్త్రీ పశుజడములను వినా। తక్క

అన్యే - ఇతరములు. మహదాఖ్యాః - మహత్తులను పే

రుగలవి. స్యుః, అగును, అనఁగా స్త్రీలు తిర్యగ్జంతువు

లున చేతనములు న మహత్తులను పేరుగలవి. యితరము

లు మహత్తులను పేరుగలవియని తాత్పర్యము.

౧౦ ॥సూ॥ తద్విశేషణాశ్చాపి॥ టీక॥ తత్ - వానియొ

క్క - విశేషణాశ్చాపి విశేషణములును మహదాఖ్యాః

మహత్తులను పేరుగలవి। అనఁగా నమహచ్ఛబ్దవిశేషణ

ములు నమహత్తులు మహచ్ఛబ్దవిశేషణములును మహ

త్తులని తాత్పర్యము

౧౧॥ సూ॥ మహతోతఉద్విభక్తౌ॥ టీక॥ మహతః

మహచ్ఛబ్దముయొక్క - అతః - అకారమునకు విభక్తౌ వి

భక్తిపరంబగునపుడు - ఉత్ - ఉకారము స్యాత్. అగు

ను అనఁగా విభక్తిపరంబగునపుడు మహచ్ఛబ్దసంబం

ధియగు నకారంబునకుకారంబువచ్చునని తాత్పర్యము

ఉ. రాముఁడు రాములు- ఇత్యాదులు

౧౭॥ మూ॥ మహతస్సోర్డుజనితో౽భవేత్పుంసి॥ టీక॥
అనితః ఇకారాంతము గాని మహతః మహచ్ఛబ్దము యొక్క సోః సుప్రత్యయమునకు. డుజ్ డుజాదేశము పుంసి పుంలింగమందు- భవేత్. అగును। అనఁగాఁ బుంలింగమందికారాంతవ్యతిరిక్తమహచ్ఛబ్దసుప్రత్యయంబునకుడుజ్జువచ్చునని తాత్పర్యము జకారంబిత్తుగావున దానికిలోపంబుగలుగును సానునాసికోచ్చారణంబిత్- అనుటవలనజకారంబిత్తుగాఁ గలవిబిందుపూర్వకంబగును గావున డువర్ణకంబునకుబిందుపూర్వకత్వంబు

ఉ. రాముఁడు. సుగుణాభిరాముఁడు - ఇత్యాదులు
పుంసియనుటవలనదధిధాపత్ర్యము - ఇత్యాదులందును. మహతః అనుటవలనవనము ఇత్యాదులందును. అనితః అనుటవలనహరి. ఇత్యాదులందునుడువర్ణకంబు లేదు - ఒకానొకచోటనుమహచ్ఛబ్దంబునకుమహాత్వవివక్షయందుడుజ్జువచ్చును. ఉ- మహేంద్రుఁడు -. మేఘుఁడు ఇత్యాదులు

ఇచట- సుఅమనది సంస్కృతప్రథమైకవచనము. సంస్కృతవిభక్తులేవియనిన

| | | | |
|---|---|---|---|
| ఏ | ద్వి | బ | |
| సు | ఔ | జస్ | ప్రథమావిభక్తి |
| అమ్ | ఔట్ | శస్ | ద్వితీయావిభక్తి |
| టా | భ్యామ్ | భిస్ | తృతీయావిభక్తి |
| ఙే | భ్యామ్ | భ్యస్ | చతుర్థీవిభక్తి |
| ఙసి | భ్యామ్ | భ్యస్ | పంచమీవిభక్తి |
| ఙస్ | ఓస్ | ఆమ్ | షష్ఠీవిభక్తి |
| ఙి | ఓస్ | సుప్ | సప్తమీవిభక్తి |

భాషయందుద్వివచనంబులేదు

౧౩॥ సూ॥ ఆమ న్త్రణసుజసో స్తుః క్రమేణ చాదారదాగమావ న్తే। టీక॥ ఆమన్త్రణసుజసోః-ఆమన్త్రణ సంబోధనముయొక్క సుజసోః- ఏకవచనబహువచనములకు .అన్తే అంతమందు క్రమేణ క్రమముగా అదారదాగమౌ .అత్ అరత్ .అనునాగములు స్తః

అగుచున్నవిఅనఁగా-సంబోధనప్రథమైకవచనంబునకు డాగమంబునుబహువచనంబున కారాడాగమంబును వచ్చునని తాత్పర్యము. తకారంబుచ్చారణార్థంబు. ఉ. ఓరాముఁడ ఓరాములార ఇత్యాదులు - ఈయాగమంబులకుఁ గొండొకచోటదీర్ఘంబువికల్పంబుగానగు- ఓ రాముఁడా ఓరాములారా- ఇత్యాదులు

౧౪॥మూ॥ లుజసోలశసోలాన్తాత్ ॥టీక॥ అలాన్తాత్ ౹ాంతముగాని ప్రాతిపదికముకంటెఁబరమయిన - జసః - ప్రథమాబహువచనమునకు - లు- లువర్ణకము శసః - ద్వితీయాబహువచనమునకు - ల - లవర్ణకము - స్యాత్ - అగును। అనఁగానకారపరకలకారాంతవ్యతిరిక్తప్రాతిపదికముకంటెఁబరమయినప్రథమాబహువచనంబునకులువర్ణకంబునుద్వితీయాబహువచనంబునకులవర్ణకంబు నాదేశంబగునని తాత్పర్యము ఉ॥ రాములు - రాములఁ - ఇత్యాదులు.

౧౫॥మూ॥ లాన్తాత్తురౌతయోఃక్రమేణస్తః॥ టీక॥

లాన్తాత్ లకారాంతప్రాతిపదికముకంటెఁ బరములు యిన - తయోస్తు : ఆ ప్రథమాబహువచనద్వితీయాబహువచనములకైతే । క్రమేణ । క్రమముగా । రురౌ । రురవర్ణకములు స్తః - అగుచున్నవి - అనఁగా నకారపరకలకారాంతప్రాతిపదికముకంటెఁ బరమయిన ప్రథమాబహువచనమునకు రువర్ణకము ద్వితీయాబహువచనమునకు రవర్ణకము వచ్చునని తాత్పర్యము - బాలురు బాలురన్ - ఇత్యాదులు - అకారపరకలకారాంతము ని వ్యాఖ్యానముచేయుటవలన బుద్ధిశాలులు . బుద్ధిశాలులన్ - మృదుతాలులు . మృదుతాలులన్ . ఇత్యాదులయందు రురవర్ణకంబులు రావు.

౧౬॥ మూ॥ నిరమో మహతామ్ ॥టీక॥ మహతామ్ - మహచ్ఛబ్దముల యొక్క . అమః - ద్వితీయైకవచనమునకు నిః నివర్ణకము . స్యాత్ . అగును, అనఁగా మహచ్ఛబ్దంబుల ద్వితీయైకవచనంబునకు నివర్ణకంబు వచ్చును - నష్టాశ్వదగ్ధరథన్యాయమువలన మహాత్తులద్వి

తీర్యైకవచనమునకు - సువర్ణకంబువచ్చు నని తాత్పర్యము । ఉ । రాముని౯ - వనమును - ఇత్యాదులు.

౧౭॥మూ॥ లుక్వాస్యాత్ ॥టీక॥ లుక్వా - లోపమును - స్యాత్ - అగును। అనఁగానా నిసువర్ణకములకులోపంబువికల్పంబుగానగునని తాత్పర్యము - ఉ - రాము౯ - వనము౯ - ఇత్యాదులు.

౧౮॥మూ॥ కర్మప్రవచనీయకే కూర్చిః॥టీక॥ కర్మప్రవచనీయకే - కర్మప్రవచనీయార్థకంబగు కూర్చిః - కూర్చివర్ణకము - స్యాత్ - అగును। అనఁగాఁ గర్మప్రవచనీయయుక్తేద్వితీయా అనుసూత్రమందువిధింపఁబడిన ద్వితీయకు కూర్చి యనియగునని తాత్పర్యము - ఉ. జపముంగూర్చివర్షము - ఇత్యాది.

౧౯ ॥ మూ ॥ మహతో నిలౌవిభక్త్యాటాంవౌవచనద్వయే క్రమేణాస్తః ॥ టీక ॥ మహతః - మహచ్ఛబ్దమునకు. టాంవౌ . తృతీయమొదలు గాఁగల - విభక్తౌ విభక్తి పరమగుచుండఁగా - వచనద్వయే . ఏకవచనబహువ

పనము లందు - క్రమేణ - క్రమముగా - సిలౌ - నిలువ
స్యకములు - స్తః. అగుచున్నవి। అనఁగానుహచ్ఛబ
బునకుఁదృతీయాదివిభక్తిపరమగునపుడేకవచనంబున
న్యాగమంబునుబహువచనంబునలాగమంబును వచ్చు
నని తాత్పర్యము- ఉ- రామునిచేతన - రాములచేతన -
రామునికొఱకు - రాములకొఱకు నిత్యాదులు. ఇచ
బహుహాతః అను నేక వచన స్వారస్యముచేత నేకవచ
నమందువచ్చునట్టిన్యాగమముమహచ్ఛబ్దనియతము. బ
హువచన మందు వచ్చునట్టిలాగమము మహదమహ
త్సాధారణమనియెఱుఁగునది -

౭౦ ॥ మూ॥ టాదివిభక్తౌనిర్నైత్యేకే ॥ టీక ॥ టాది
విభక్తౌ-టా తృతీయైకవచనము-ఆది - మొదలు గాఁ
గల - విభక్తౌ, విభక్తిపరమగుచుండఁగా- నిః - న్యా
గమము - నేతి - లేదని - ఏకే - కొందఱు అనఁగాటా
దివిభక్తిపరంబగునపుడు న్యాగమంబు లేదని కొందఱందు
రని తాత్పర్యము . ఉ . రాముచేతన - రాముకొఱకు
నిత్యాదులు -

౨౧ ॥ మూ ॥ సామన్త్రణే నేడుడిత్యన్యే ॥ టీక ॥ ఆమన్త్రణే - సంబోధనమందు - డుజ్ - డుజాదేశము - నే
ఓ - లేదని - అన్యే - ఇతరులు అనఁగా సంబోధనము
నందు డుజ్జు లేదని మఱికొందఱందు రని తాత్పర్యము -
ఉ - ఓరాము ఇత్యాది - ఈపక్షంబున - పద్మాస్వా
త్సంబుద్ధేః అను సంస్కృత వ్యాకరణముచేత సుప్రత్య
యంబు లోపించుచున్న దని తెలియవలయు -

౨౨ ॥ మూ ॥ టాస శ్చేతః ॥ టీ ॥ టాసః - తృతీ
యావిభక్తికి - చేతః - చేత వర్ణకము - స్యాత్ - అగును
అనఁగా తృతీయైక వచన బహువచనములకుఁ జేతవర్ణ
ంబాదేశంబుగా వచ్చునని తాత్పర్యము। చేతవర్ణకం
బు చేవర్ణకంబునకుపలక్షణము ఉ - రాముఁ చేత - రా
ము చే - రాములచేత - రాములచే - ఇత్యాదులు -

౨౩॥మూ॥ జేసః కయికొఱకూ॥టీక॥ జేసః - చతుర్థీ
విభక్తికి - కయికొఱకూ - కయికొఱకు వర్ణకములు - స్యుః -
అగుచున్నవి। అనఁగా జతుర్థీవిభక్తికి గయి కొఱకున

ర్ణకంబులాదేశంబులుగావచ్చునని తాత్పర్యము - ఉ-రామునికయి, రాములకయి. రామునికొఅను - రాములకొఅను - ఇత్యాదులు.

౭౮ ॥ మూ ॥ జసిసఉచ్యతేవలనః ॥ టీక ॥ జసిసః - పంచమీవిభక్తికి - వలనః - వలనవర్ణకముఉచ్యతే చెప్పఁబడుచున్నది | అనఁగాఁబంచమీవిభక్తికివలనవర్ణకంబాదేశంబుగా వచ్చునని తాత్పర్యము- ఉ- రామునివలన - రాములవలన - ఇత్యాదులు.

౭౯ ॥ మూ ॥ నఃకౌ ॥ టీక ॥ కౌ కువర్ణకముపరముగుచుండఁగా - నః - నాగమము - స్యాత్ - అగును। అనఁగానుకారాంతంబుకంటెఁబరంబయినషష్ఠ్యేకవచనంబునకుఁగువర్ణకంబాదేశంబగు నపుడు నకారంబుపూర్వాగమంబుగావచ్చు నని తాత్పర్యము - ఉ- రామునకు - గురునకు - ఇత్యాదులు - ఈనకారంబుఋకారాంత పదంబునకుఁ దలుచుగానగు - ఉ - పితౄనకు - సవితౄనకు - ఇత్యాదులు.

# సటీకాంధ్ర శబ్దచింతామణి.

౩౬ ॥ మూ ॥ జసఃకురనితామ్ ॥ టీక ॥ అనితామ్ ఇకారాంతములుగానిశబ్దములయొక్క జసః - షష్ఠీ విభక్తికి - కుః - కువర్ణకము స్యాత్ అగును | అనఁగా నికారాంతవ్యతిరిక్తంబులగుశబ్దంబులషష్ఠీవిభక్తికిఁ గువర్ణకంబాదేశంబుగావచ్చునని తాత్పర్యము ఉ రామునకు - రాములకు - ఇత్యాదులు-

౩౭ ॥ మూ ॥ అందు ఙేషః ॥ టీక ॥ ఙేషః - సప్తమీ విభక్తికి - అందు - అందువర్ణకము - స్యాత్ అగును- అనఁగా సప్తమీవిభక్తికందు వర్ణకంబాదేశంబుగా వచ్చునని తాత్పర్యము - ఉ. రామునియందు - రామునందు - రాముల యందు - రాములందు - ఇత్యాదులు-

౩౮ ॥ మూ ॥ సవిధవర్తినామిందు ॥ టీక ॥ సవిధవర్తినామ్ సమీపబోధకశబ్దములకు - ఇందు - ఇందువర్ణకము - స్యాత్ అగును | అనఁగా సమీపవర్తియగునిజస్వశబ్దార్థమునకధికరణత్వమునువివక్షించు నపుడు ప్రకృతిప్రత్యయసముదాయంబునకు నిందువర్ణకం

బువచ్చునని తాత్పర్యము - ఉ - ఇందుభుజియించె - ఇతి దుశయనించె - ంధనలిరత్నసానువులు - ఇత్యాదులు.

౨౮ ॥ మూ ॥ తోడ-సహార్థేటా-సః॥ టీక ॥ సహార్థే-సహార్థమందు - టా-సః - తృతీయావిభక్తికి - తోడ - తోడవర్ణకము - స్యాత్ - అగును అనఁగా-సహాయుక్తేప్రధానే అను సూత్రమందుఁ దింపఁబడినతృతీయా విభక్తికిఁదోడవర్ణకంబువచ్చునని తాత్పర్యము తోడ వర్ణకంబుతోవర్ణకంబున కుపలక్షణము - ఉ - రాముని తోడ వచ్చెసీత రామునితోవచ్చెసీత ఇత్యాదులు. ఈతోడతోవర్ణకములు ఉక్తికర్మంబు శ్రోతయగునపుడునగు - ఉ - రామునితోడనిట్లనియె - రామునితోనిట్లనియె ఇత్యాదులు.

౩౦॥మూ॥ షష్ఠీతుపఞ్చమీగుణే హేతౌ॥టీక॥ గుణే గుణము హేతౌ కారణముగుచుండఁగా పఞ్చమీ తు - పంచమీవిభక్తియయితే షష్ఠీ షష్ఠియని. స్యాత్ । అగును అనఁగావిభాషాగుణే స్త్రియామ్ - అ

మసూత్రమందువిధింపఁబడిన పంచమీవిభక్తికిఁబట్టివర్ణకంబువచ్చునని తాత్పర్యము. ఉ. జ్ఞానముఁబట్టి మోక్షము జాడ్యముఁబట్టి బద్ధుఁడు ఇత్యాదులు.

3౧॥ మూ॥ కంటేన్యారాదాదేః॥ టీక॥ అన్యారాదాదేః - అన్యారాదాదిసూత్రముచేత విధింపఁబడిన పంచమీవిభక్తికి కంటె కంటేయని స్యాత్. అగును అనఁగా అన్యారాదితరర్తే ఇత్యాదిసూత్రమందు విధింపఁబడినపంచమీవిభక్తికిఁ గంటెవర్ణకం బాదేశంబుగా వచ్చునని తాత్పర్యము ॥ఉ॥ రాముకంటె నితరుఁడు వానికంటె నధిపుఁడు దానికంటె సమీపము దానికంటె దూరము దానికంటెఁ బూర్వ ఇత్యాదులు.

3౨॥ మూ॥ లోపలనిర్ధారణోద్భవాః షష్ఠ్యాః॥ టీక॥ నిర్ధారణోద్భవా - నిర్ధారణ - నిర్ధారణార్థమందు - ఉద్భవా పుట్టిన - షష్ఠ్యాః షష్ఠీవిభక్తి లోపల లోపలయని స్యాత్. అగును॥ అనఁగా యతశ్చ నిర్ధారణమను సూత్రమందు విధింపఁబడిన షష్ఠీవిభక్తికి లోపలవర్ణకం బా

దేశంబుగా వచ్చునని తాత్పర్యము. ఉ - దేవతలలో లసీతయధికురాలు ఇత్యాది.

33॥ మూ॥ యొక్క చ శేషే షష్ఠీ ॥ టీక॥ శేషే - శేషార్థమందు విధింపఁబడిన - షష్ఠీ - షష్ఠీవిభక్తి - యొక్క యొక్క - యని - స్యాత్ అగును। అనఁగా షష్ఠీ శేషే అను సూత్రమందు విధింపఁబడిన షష్ఠీవిభక్తికి యొక్క వర్ణకంబు వచ్చునని తాత్పర్యము - ఉ - రాముని యొక్క గుణములు - రాజు యొక్క పురుషుఁడు - ఇత్యాదులు.

34॥ మూ॥ విషయనిమిత్తాదిజాతథైవాన్యా ॥ టీక॥ విషయనిమిత్తాదిజా - విషయనిమిత్తాద్యర్థములందుఁ బుట్టిన - అన్యా - ఇతరవిభక్తి అనఁగా సప్తమీవిభక్తి - తథైవ - ఆప్రకారమే - అనఁగా విషయ - నిమిత్తాద్యర్థంబులందుఁ గలిగిన సప్తమీవిభక్తి ప్రథమా సమముగానే యుండునని తాత్పర్యము। ఆ దిశబ్దము చేత సతిసప్తమి గ్రహింపఁబడు - ఉ - దేవతలవిషయము భక్తి - చర్మము నిమిత్తము పులిని జంపె - భృత్యులావులఁ బిదుకంగ వచ్చె - ఇత్యాదులు.

౩౫॥మూ॥ స్యాదనుహాం తాంవిభక్త్యా సోశ్చము ॥టీక॥
అనుహాంతామ్ - అనుహాంచ్ఛబ్దములకు . విభక్తౌ విభక్తిపరమగుచుండఁ గా సోశ్చ ప్రథమైకవచనమునకును ము - ముపర్ణకము - స్యాత్ - అగును।అనఁగా నను హాంచ్ఛబ్దంబుల ప్రథమైకవచనంబునకుమువర్ణకంబాదేశంబు గానగుఁ బ్రథమాబహువచనంబు మొదలుగాఁ దక్కినవిభక్తులు పరములగు నపుడా గమంబు గానగునని తాత్పర్యము . ఉ - వనము - వనములు - వనమును . వనముల ఇత్యాదులు.

౩౬॥ మూ॥ తదుపరి పునర్మ్బూ ప్రాచామ్ ॥టీక॥ తదుపరి - ఆమువర్ణకము మీఁద . పునః వెండియు - ముబూ - ముబు వర్ణకములు - ప్రాచామ్ . ప్రాచీనులమతమునందు - స్యాతామ్ అగును।అనఁగా నామువర్ణకముమీఁద వెండియు - మువర్ణకబువర్ణకంబులు ప్రాచీనులమతమునందుఁ వచ్చునని తాత్పర్యము ఉ . వనమ్ము - వనమ్ములు . వనంబు - వనంబులు - ఇత్యాదు

## అజంతపరిచ్ఛేదము.

ఉ॥ ఇచటసలోలోశ్చయనువక్ష్యమాణసూత్రమునం దలిచకారంబు వలన ఋవర్ణకంబు నందలి యుకారంబునకు లోపంబురాఁగా మిగిలిన ఋకారంబునకుఋవర్ణకముపరంబగునపుడు సంశ్లేషమును - ఋవర్ణకంబు పరంబగునపుడు పూర్ణబిందువు నగునని యెఱుంగవలయు -

౩౭॥ మూ॥ సోర్లుగితః॥ టీక॥ ఇతః ఇకారాంతశబ్దముయొక్క - సోః - ప్రథమైకవచనమునకు లుక్ - లోపము - స్యాత్ - అగును - అనఁగాని కారాంతశబ్దములసుప్రత్యయంబునకు లోపంబువచ్చునని తాత్పర్యము ఉ - హరి - మతి - వారి - ఇత్యాదులు.

౩౮॥ మూ॥ ఉద్బహుత్వే॥ టీక॥ బహుత్వే - బహువచనము పరమగుచుండఁగా - ఇతః - ఇకారాంతమునకు - ఉత్ - ఉకారము - స్యాత్ - అగును - అనఁగా నికారాంతశబ్దములకుబహువచనంబుపరంబగునపుడు కారంబంతాదేశంబుగానగునని తాత్పర్యము ఉ - హరులు - మతులు - వారులు - ఇత్యాదులు.

౩౯॥ మూ॥ సంబుద్ధౌ నాత్ ॥ టీక॥ సంబుద్ధౌ - సంబోధనైకవచనాంతమునకు అత్ - అదాగమము. న - లేదు అనఁగాని కారాంతశబ్దములసంబోధనప్రథమైకవచనాంతమునందున దాగమంబు లేదని తాత్పర్యము

ఉ - ఓహరి - ఓమతి ఓ వారి - ఇత్యాదులు.

౪౦ ॥మూ॥ ఇతాం జసః కిశ్చ ॥టీక ॥ ఇతామ్ - ఇకారాంతశబ్దముల యొక్క - జసః షష్ఠ్యేకవచనమునకు - కిశ్చ కివర్ణకమును. స్యాత్ అగును - అనఁగాని కారాంతశబ్దములషష్ఠ్యేకవచనమునకుఁ గివర్ణకంబాదేశంబు గానగునని తాత్పర్యము - ఉ - హరికి - మతికి ఇత్యాదులు.

౪౧ ॥ మూ ॥ టాదావితో ననిస్స్యాత్ ॥ టీక ॥ ఇతః ఇకారాంతమునకు - టాదౌ - టాదివిభక్తిపరమగుచుండఁగా - నిః - న్యాగమము - నస్యాత్ - కలుగదు. అనఁగాని కారాంతశబ్దమునకుఁ దృతీయైకవచనము మొదలగు విభక్తిపరంబగునపుడు న్యాగమంబు లేదని తాత్పర్య

## అజంతపరిచ్ఛేదము.

ము - ఉ - హరిచేత హరికో అను। ఇత్యాదులు।

౭౨॥ సూ॥ ఈదన్తా ఇద్వదేవ కృతహ్రస్వాః॥ టీక॥ కృతహ్రస్వాః - కృత - చేయఁబడిన హ్రస్వాః హ్రస్వముగల - ఈదన్తాః - ఈకారాంతములు - ఇద్వదేవ - ఇకారాంతములవలెనే - భవన్తి - అగుచున్నవి। అనఁగా దీర్ఘాణాం హ్రస్వస్యాత్తనువత్త్యమాణసూత్రముచేత హ్రస్వాంతములైనయీకారాంతశబ్దములికారాంతశబ్దములవలెనగునని తాత్పర్యము. ఉ. గ్రామణి - గ్రామణులు నది - నదులు ఇత్యాదులు.

౭౩॥ సూ॥ వికృతౌ క్వచిచ్చ లోపో మోర్దీర్ఘశ్చాత ఆదిమస్య భవేత్॥ టీక॥ వికృతౌ - ఆంధ్రమందు క్వచిత్ - ఒకానొకచోట - మోః - మువర్ణమునకు - లోపః - లోపము. ఆదిమస్య - మొదటిదయిన - అతః - అకారమునకు దీర్ఘశ్చ - దీర్ఘమును భవేత్ - అగును అనఁగా ఆంధ్రమందొకానొకచోటమువర్ణమునకు లోపంబును. ఆమువర్ణముకంటెఁ బూర్వమందున్న యకారంబునకు

ఏర్సుంబును వచ్చునని తాత్పర్యము - ఉ - జొంపములు - జొంపాలు ఇత్యాదులు

౮౮॥ మూ॥ సర్వత్రోదోతోర్వుగ్వతిముపత్ ॥టీక॥ సర్వత్ర లింగ త్రయమందు ఉదోతోః ఉకార ఓకారాంతములకు వుః వువర్ణకము ముపత్ మువర్ణకము వలె భవతి అగుచున్నది అనఁగా నుకారౌకారాంతశబ్దములకు వువర్ణకము మువర్ణకము వలెఁ బ్రథమైకవచనమున నాదేశముగా నితరవిభక్తులు పరము లగునపుడాగమంబుగా నగునని తాత్పర్యము - ఉ - గురువు గురువులు. ధేనువు ధేనువులు వస్తువు - వస్తువులు గోవు - గోవులు - ఇత్యాదులు.

౮౯॥ మూ॥ ధుజ్మహత్పదానాం వా ॥టీక॥ మహత్పదానామ్ మహచ్ఛబ్దములకు ధుజ్ ధుజాదేశము వా వికల్పముగా - స్యాత్ - అగును - అనఁగా నుకారాంతంబులగు మహచ్ఛబ్దంబులకు - ధుజ్ను - వికల్పంబుగా నగునని తాత్పర్యము। ముపర్ణకము న్యాదులకుపలక్షణము





౪౭ ॥ మూ ॥ దీర్ఘాణాం హ్రస్వస్స్యాత్ ॥ టీక ॥ దీర్ఘాణామ్ - దీర్ఘాంతశబ్దములకు - హ్రస్వః - హ్రస్వము స్స్యాత్ - అగును। అనఁగా నామంబులతుదినుండు దీర్ఘంబులకు హ్రస్వంబగునని తాత్పర్యము - ఉ. అంబ - గౌరి. వధువు - ఇత్యాదులు.

౪౮ ॥ మూ ॥ నచ దేశ్యపదే ॥ టీక ॥ దేశ్యపదే దేశ్య పదమందు - నచ - లేదు। అనఁగా దేశ్య పదంబులకు దీర్ఘంబునకు హ్రస్వంబు గలుగదని తాత్పర్యము - ఉ. నవలా. నేజా. లకోరి - ఇత్యాదులు.

౪౯ ॥ మూ ॥ నచైక వర్ణేపి ॥ టీక ॥ ఏకవర్ణేపి - ఏకాక్షరశబ్దమందును నచ లేదు। అనఁగా నేకాక్షర సంస్కృతశబ్దంబులదీర్ఘంబునకు హ్రస్వంబు గలుగదని తాత్పర్యము - ఉ. శ్రీ - హ్రీం జ్యా - మా - ఇత్యాదులు -

౫౦ ॥ మూ ॥ డాబవిధాత్రాదేరుః ॥ టీక ॥ అవిధాత్రాదేః - విధాత్రాదికాని - ఉః - ఋ - కారాంతశబ్దమునకు డాప్ - డాప్పు స్స్యాత్ అగును - అనఁగా విధాత్రా

దిగణవ్యతిరిక్తంబగు ఋకారాంతశబ్దంబునకు డాప్ప వచ్చునని తాత్పర్యము। విధాతృ సవితృ నేతృ ఇత్యాదులు. విధాత్రాదులు డాప్. అనుచోట డకార పకారంబులు ఇత్సంజ్ఞగలవి గావుననవిలోపింపఁగామిగిలిన దిఆకారంబు- ఈప్రత్యయముడిత్తు గావుననంత్యాచ్చునకు లోపంబు ఉ. పిత. మాత భ్రాత. స్వస. ఇత్యాదులు.

౭౧॥ మూ॥ తస్యచ వా॥ టీక॥ తస్య చ- ఆవిధాత్రాదికిని వా వికల్పముగా- స్యాత్ - అగును। అనఁగా- విధాత్రాదిగణమునకును డాప్పు వికల్పముగా నగు నని తాత్పర్యము- ఉ, విధాత విధాతృఁడు - సవిత - సవితృఁడు- నేత- నేతృఁడు - ఇత్యాదులు - డాప్పు వచ్చినపిమ్మట దీర్ఘాణాం హ్రస్వస్స్యాత్తను సూత్రంబు చేత హ్రస్వంబుగలుగును-

౭౨ ॥ మూ॥ తావుభౌరమేశసమా॥ టీక॥ తావుభౌ ఆరెండును- రమేశసమా రమా-రమాశబ్దముతోడ, ఈశ

శబ్దముతోడ. సమా. సమానములు అనఁగా డాబంతంబులు రమాశబ్దతుల్యంబులు ఆడాబంతములీశ శబ్ద తుల్యంబులు గానుండునని తాత్పర్యము. ఉదాహరణంబులున్ను చెప్పఁబడియె.

౪౩॥ మూ॥ క్వచిదసమహతోపి హుజ్స్యాత్ ॥ టీక॥ క్వచిత్ - ఒకానొకచోటఁ అసమహతోపి అసమహచ్ఛబ్దమునకును - హుజ్ - హుఙాదేశము - స్యాత్ - అగును। అనఁగాఁగొన్ని యెడలనసమహచ్ఛబ్దంబులకును హువర్ణకంబు వచ్చునని తాత్పర్యము - ఉ - కత్తెరఁడు - కైరఁడు - జన్నఁడు - పులియఁడు వసమొకఁడు - ఇత్యాదులు.

౪౪ ॥ మూ॥ ఏకాదేరసమహతాంచ డావుత్ ॥ టీక॥ ఏకాదేః ఏకాదికిని - అసమహతాంచ అసమహచ్ఛబ్దములకును - డౌ - డువర్ణకము పరమగుచుండఁగా. ఉత్ - ఉకారము - న లేదు। అనఁగా నేకాదిగణమునకు నసమహచ్ఛబ్దంబులకును డువర్ణకము పరమగు నపుడు కారంబుగలుగదని తాత్పర్యము। ఏకాదికి నుదాహరణ

ము - ఒక్రుఁడు అతఁడు ఇతఁడు. ఎవ్వఁడు - వా
మఁడు మగఁడు - మిండఁడు గండఁడు - ఎల్లఁడు
మల్లఁడు - ఇత్యాదులు - అమహత్తులకుదాహరణము -
కత్తళఁడు కత్తళనిక - ఇత్యాదులు - క్వచిదమహ
తోఽపీత్యాదిసూత్రమునందలిడువర్ణకంబుమహత్తార్యం
బులకుపలడుకంబగుటంజేసినివర్ణకంబునకువలెనుత్వం
బునకుఁబ్రాప్తియనియెఱుఁగునది -

౫౫॥ మూ॥ స్త్రీత్వబహుత్వేసురాదేరసమాసే॥

టీక॥ సురాదేః. సురాదిశబ్దమునకు స్త్రీత్వబహు
త్వే. స్త్రీత్వబహుత్వములు - స్యాతామ్ - అగును -
అసమాసే సమాసమందుఁగలుగవు - అనఁగా సురా
దిగణమునకుసమాసములేనపుడు స్త్రీత్వబహుత్వము
లువచ్చునని తాత్పర్యము - ఉ - సురలు - అసురయో
ధశుంఠ ఇత్యాదులు - సమాసమందు - భూసురుఁ
డు ఇత్యాది ఇచటబహుత్వనియమముసురశబ్దంబు
నకేయనిగ్రహింపవలయు

౪౭౮ ॥మూ॥ లుగ్భ వేత్కుశాదేర్మోః ॥టీక॥ కుశాదేః - కుశాదిగణము యొక్క - మోః - మువర్ణకమునకు - లుక్ - లోపము, భవేత్ - అగును। అనఁగాఁ గుశాదిశబ్దంబుల మువర్ణకంబునకు లోపంబు గలుగునని తాత్పర్యము ఉ - కుశ దర్భ - హంస - భ్రమ - చరిత్ర - అతులు - ఇత్యాదులు.

౪౭౯ ॥మూ॥ షష్ఠీవిశేషణానాం ప్రథమా స్యాత్ ॥టీక॥ షష్ఠీవిశేషణానామ్ షష్ఠీ - షష్ఠ్యంతముల యొక్క - విశేషణానామ్ - విశేషణములకు. ప్రథమా - ప్రథమావిభక్తి - స్యాత్ - అగును, అనఁగా షష్ఠ్యంతవిశేషణంబులకుఁ బ్రథమావిభక్తి వచ్చునని తాత్పర్యము; ఉ అనఘచరితుఁడు రఘునందనునకుఁ బ్రణతి ఇత్యాది.

౪౮౦ ॥మూ॥ వ్యవహితాశ్చ సర్వే స్యుః ॥టీక॥ సర్వే - సమస్తశబ్దములు - వ్యవహితాశ్చ వ్యవధానము గలవిగా - స్యుః - అగును। అనఁగా విశేషణవిశేష్యంబులితరశబ్దంబుల చేత వ్యవధానము గలవి యును అగునని తా

త్పర్యము - చకారంబునకన్వాదయయమాగమము [illegible] గా ముఁదల: చెవసుగుణాభిరామునెపుడు - రాముని[illegible]రాముసద్గుణధాముఁదలఁతు - ఇత్యాదులు.

౫౯ ॥ మూ॥ వికృతౌచ స్త్రీలిఙ్గా స్త్రీలిఙ్గకసర్వనామధేయాస్స్యుః॥టీక॥ వికృతౌచ - ఆంధ్రమందును - స్త్రీలిఙ్గాః - స్త్రీలింగశబ్దములు - స్త్రీలిఙ్గకసర్వనామధేయాః - స్త్రీలిఙ్గక - స్త్రీలింగముగల - సర్వనామధేయాః సమస్తవిశేషణములుగలవిగా - స్యుః - అగును। అనఁగాఁ దెనుఁగున ౦మను స్త్రీలింగవిశేషణంబులు స్త్రీలింగముగలవిగానేయగునని తాత్పర్యము ఉ - సీతభక్తవత్సల - పాలమున్నీటికూఁతురుపద్మహస్త - ఇత్యాదులు.

౬౦ ॥ మూ ॥ ఉభయవిధమమహతీనామ్ ॥ టీక ॥ అమహతీనామ్ - అప్రాణివాచకస్త్రీలింగములకు - ఉభయవిధమ్ - రెండువిధములుగలదిగా - స్యాత్ - అగును। అనఁగా సప్రాణివాచకస్త్రీలింగవిశేషణము

లింగముగలదియును స్త్రీలింగములేనిది యనగునని తాత్పర్యము - ఉ . శరశ్చంద్రికమనోహరము - మనోహర - ఇత్యాది.

౮౧ ॥ మూ ॥ నియత స్స్త్రీ ప్రత్యయస్తు సర్వాసామ్॥ టీక॥ సర్వాసామ్ సమస్త స్త్రీలింగశబ్దములకు - స్త్రీప్రత్యయస్తు స్త్రీప్రత్యయమైతె - నియతః నియతము - అనగా సమస్తములయిన స్త్రీలింగశబ్దములకు టాప్ ఙీప్ - మొదలయిన స్త్రీ ప్రత్యయములు నియతములని తాత్పర్యము - ఉ - రామకృష్ణసంతాపహారిణి - సీత సర్వాభీష్టప్రదాత్రి - పుడమిచెలిమాఁతులే సర్వభువనజనని ఇత్యాదులు,

౮౨ ॥ మూ ॥ ఇతరత్ర చద్వితీయా తస్యాః ప్రథమా చ జడపదానాంస్యాత్ ॥ టీక ॥ జడపదానామ్ అచేతన వాచకపదములకు - ఇతరత్ర - ద్వితీయేతర విభక్త్యర్థమందు - ద్వితీయా - ద్వితీయా విభక్తియు తస్యాః - ఆద్వితీయావిభక్తికి - ప్రథమాచ - ప్రథమావి

## అజంతపరిచ్ఛేదము.

భక్తియు స్యాత్ - అగును। అనఁగా నచేత

ములైనశబ్దములకు నితరవిభక్త్యర్థమునందు ద్వి

భక్తియు నాంద్వితీయార్థమునందుఁ బ్రథమావిభక్తియు

వికల్పముగావచ్చునని తాత్పర్యము - ఉ - హేతి నరు

లనఁటికె హేతిచే నరులనఁటికె ద్వారకనున్న వాఁ

డు - ద్వారకయందున్న వాఁడు - రథమ్యెక్కె - రథము

నెక్కె - ఇత్యాదులు.

౬౩ ॥ మూ ॥ స్తో వావౌ రైనావ్యోః॥ టీక॥ రైనావోః - రైశ్శబ్దనౌశబ్దములయంత్యవర్ణములకు - అవావౌ - ఓ- ఆవ - అనునవి - స్తః అగుచున్నవి అనఁగా రైశ్శబ్దనౌశబ్దములకు - ఓ ఆవ - అనునవిక్రమముగా నంతాదేశంబులగునని తాత్పర్యము ఉ రోయియావి - రోపడఁతి - నావఁజూచె నావనడిచె - ఇత్యాదులు,

౬౪ ॥ మూ ॥ స్త్రీవద్గ్లౌః॥ టీక॥ గ్లౌః గ్లౌశబ్దము - స్త్రీవత్ - స్త్రీలింగమువలె - స్యాత్ అగును అనఁగా గ్లౌశబ్దము స్త్రీలింగమువలెననుతాం స్త్రీయామిత్యాదివ

ష్యమాణ సూత్రము చేతసులోపంబును బొందుననితా త్పర్యము - ఉ గ్లొయుదయించెనిత్యాది -

౬౫॥మూ॥భూదివోస్తుజౌయత్తత్ ॥ టీక॥ భూదివో స్తు - భూశబ్దదివ్ శబ్దములకైతే - జౌ - సప్తమ్యేకవ చనమందు - యత్ - ఏరూపముగలదో - తత్ - ఆరూ పము- స్యాత్ - అగును। అనఁగాభూశబ్దదివ్‌శబ్దములకు సంస్కృతసప్తమ్యేకవచనమందెద్దిరూపంబు గలదో యదియతెనుఁగునందుఁబ్రాతిపదికంబగునని తాత్పర్య ము - ఉ - భువిదివినీవలనఁబొడమెఁబురుషవతంసా - ఇత్యాది.

౬౬॥మూ॥ వాయిరవుర్వక్రతమౌ॥టీక॥ వక్రతమౌ - ఐకారౌకారములు - అయిః - అయియని -అవుః - అవు అని - వా - వికల్పముగా స్యాతామ్ అగును । అ నఁగానైకారమునకు అయిఅనియుఔకారమునకుఅవు అనియునాదేశంబులువికల్పముగానగునని తాత్పర్యము ఉ - చెలువయి చెలువై - అవురా - ఔరా -ఇత్యా దులు.

# అజంతపరిచ్ఛేదము.

౬౭॥సూ॥ ఉర్ద్వన్ద్వే రః॥టీక॥ ద్వన్ద్వే ద్వంద్వసమాసమందు. ఉః - ఋకారమునకు - రః - రేఫము స్యాత్ - అగును, అనఁగా ద్వంద్వసమాసమందు పూర్వపదమందున్న ఋకారంబునకు రేఫమాదేశంబుగానగునని తాత్పర్యము. ఉ. మాత్రపితృబుద్ధి నంభోధిపుత్రికిఁగోలుతుఇత్యాది. ఇచట నుత్తరసూత్రంబునందలి క్వచిత్తనునదియ పకర్షింపఁబడుచున్నదిగావున నీకార్యంబు వైకల్పికము.

౬౮॥ సూ.॥ క్వచిద్గకారోవః॥ టీక॥క్వచిత్ - ఒకానొకచోట - గకారః గకారము - వః- వకారము- స్యాత్ అగును. అనఁగానాంధ్రమందొకానొకచోట గకారంబునకు వకారమాదేశంబుగా నగునని తాత్పర్యము. ఉ. ప్రోగు - ప్రోవు ఈగి - ఈవి. తోగ - తోవ. ఇత్యాదులు - క్వచిత్తనుటవలన రేగు - వాఁగు, బాగు ఇత్యాదులయందులేదు -

౬౯॥ సూ॥ న్వత్తాన్నామ్నశ్శుజోఽర్బహువచనే॥

[illegible]ణ్ణాత్ : నువర్ణాంతమైన నామ్నః ప్రా
[illegible]పదికముకంటె బహువచనే . బహువచనము పర
మగుచుండఁగా నోః నువర్ణమునకు కుజ్ . కుజా
దేశము స్యాత్ . అగును। అనఁగాఁ గొన్నియెడలను
వర్ణాంతశబ్దములకు బహువచనము . పరమగునపు
డు నువర్ణంబునకుఁ గుజాదేశంబు గలుగునని తాత్పర్య
ము। జకారంబిత్తు గావునఁబిందుపూర్వకత్వంబు - ఉ .
కొలను - కొలఁకులు - కెలను కెలఁకులు . వలను , వ
లఁకులు - ప్రాను - ప్రాఁకులు - ఇత్యాదులు -

౨౦॥ మూ॥ క్వచిన్నలోపశ్చ॥ టీక॥ క్వచిత్ . ఒ
కానొకచోట నులోపశ్చ - నువర్ణలోపమును - స్యా
త్ . అగును।అనఁగాఁ గొన్నియెడలనువర్ణాంతశబ్దము
లకు బహువచనము పరమగునపుడునువర్ణమునకు లో
పంబును వచ్చునని తాత్పర్యము - ఉ . చేను . చేలు -
పేను - పేలు . మీను , మీలు - ఇత్యాదులు। క్వచిత్త
నోటవలన ; మేను - మేనులు - కాను ; కానులు . వీను

అజంతపరిచ్ఛేదము.

వీనులు ఇత్యాదులయందునులోపంబు లేదు.

౭౧ ॥మూ॥ సలలోగ్బిందుయుతోడుర్వా లులయోః

టీక॥ సలలోః లకారముతోఁగూడినలువర్ణముల లులయోః లులవర్ణకములు పరములగు చుండఁగా- బిందుయుతః - బిందువుతోఁగూడిన డుః - డువర్ణకము వా - వికల్పముగా స్యాత్ - అగును। అనఁగా లకారసహితమైనలుకారంబునకులులవర్ణకంబులుపరంబు లగునపుడు పూర్ణబిందువుతోఁగూడిన - డువర్ణకంబువిక ల్పంబుగా నాదేశంబగు నని తాత్పర్యము - ఉ - విల్లు- విండులు - ముల్లు - ముండులు - పల్లు - పండులు - విం డుల - ముండుల - పండుల - విల్లులు - ముల్లులు - పల్లు లు - ఇత్యాదులు-

౭౨ ॥మూ॥ ఉల్లుగపితయోఃపరతః ॥టీక॥ తయోః అలులువర్ణకములు - పరతః - పరములగు చుండఁగా ఉల్లుగపి ఉకారలోపము ను - స్యాత్ - అగున నఁగానాలులవర్ణకములు పరంబులగునపుడు

[illegible]కారమునకులోపం బువికల్పంబుగా. అగు
నని తాత్పర్యము ఉ - రింగ్లు రింగ్లు - ముంగ్లు - ముం
గ్లు పంగ్లు - పంగ్ల. ఇత్యాదులు.

౭౩ ॥ సూ ॥ నిత్యం దారాదేశ్చ స్యాల్లోప్లల యోరుదు
రౌచతత్రస్థః ॥ టీక ॥ దారాదేః ఆలుశబ్దము మొదల
యినదానియుక్క - లోః. లువర్ణమునకు - లుల యోః
లులవర్ణకములు పరములగుచుండఁగా - బిన్దుయుతః -
బిందువుతోఁగూడిన. డుః డువర్ణకమును - ఉల్లిగపి -
ఉకారలోపమును - నిత్యమ్ - నిత్యముగా - స్యాత్
అగును। తత్ర - ఆయాలుశబ్దము మొదలయినదానియం
దుండేషు - లులయోః - లులవర్ణకములకు - రురౌ చ -
రురవర్ణకములును స్తః - అగుచున్నవి। అనఁగానా
ల్వాదిశబ్దంబులలువర్ణంబునకులులవర్ణకంబులు పరంబు
లగునపుడుబిందుసహితంబయినడువర్ణకంబు నాడువర్ణ
కంబలి యుకారంబునకులోపంబును ఆయాల్వాది
నోట్ మునొక్క. లులవర్ణకంబులకుఁగ్రమముగా రుర

వర్ణకములు నిత్యము గాన గునని తాత్పర్యము -
ఆలు ఆంద్రు ఆంద్ర - జవరాలు జవరాంద్రు - జవ
రాంద్ర. కోడలు కోడంద్రు కోడంద్ర చెల్లెలు
చెల్లంద్రు. చెల్లంద్ర - ఇత్యాదులు.

౭౮ ॥ మూ రోలః ॥ టీక ॥ రః రేఫమునకు, లః - ల
కారము - స్యాత్ - అగును | అనఁగా డలటాముదితాం
తస్యచ వాలుక్ ననుత్తరసూత్రంబుచేత ఏలు గో
రు. ఇత్యాదిశబ్దంబుల వర్ణమం వున్న యుకారంబున
కు లోపంబు వచ్చిన పక్షమందా రేఫమునకు లఘులకారం
బాదేశంబగునని తాత్పర్యము. ఉ ఏలు, ఏళ్లు - గో
రు - గోళ్లు. ఇత్యాదులు | రేఫ లకారంబు లకును ల
కారడకారంబులకు న భేదంబు గావున వానికినీసూత్రం
బుచేత నేయలఘులకారాదేశము ఉ త్రాడు - త్రాళ్లు -
తడి - తళ్లు - పాలు - పాళ్లు - అంబలి - అంబళ్లు - ఇ
త్యాదులు.

౭౯ ॥ మూ ॥ డలటాముదితాంతస్యచ వాలుక్ ॥ టీక ॥

డలటామ్ - డకార లకార టకార ముల యొక్క - ఉది తాన్ ఉకారేకారములకు - తస్యచ - ఆరేఫ సంబంధియైనయుకారమునకు - లుక్ - లోపము - వా - వికల్పముగా - స్యాత్ - అగును। అనఁగా డకార లకార టకార ముల యుకారేకారంబులకును రేఫసంబంధియగు నుకారంబునకునులులవర్ణకంబులుపరంబులగు నపుడు లోపమువికల్పము గానగునని తాత్పర్యము - ఉ - త్రాడు - త్రాళ్లు - త్రాడులు - తడి - తళ్లు తడులు - చాలు - చాళ్లు చాలులు - అంబలి - అంబళ్లు - అంబళులు - చెట్టు - చెట్లు - చెట్టులు - జెట్టి - జెట్లు - జెట్టులు - ఇత్యాదులు.

౭౬ ॥మూ॥ సలోలోశ్చ॥టీక॥సలః లకారముతోఁ గూడిన - లోశ్చ - లువర్ణమునకును - లుక్ - లోపము - వా - వికల్పముగా - స్యాత్ - అగును। అనఁగా లకారసహితలువర్ణకంబునకులోపంబువికల్పంబు గానగునని తాత్పర్యము - ఉ - పంది ళ్లేసి - పందిళ్లువేసె అంబ

అజంతపరిచ్ఛేదము.

ఖ్లాంచి - అంబళ్లగాంచి ఇత్యాదులు.

౭౭॥ మూ॥ ఔపవిభక్తికలీనామిల్లుగ్వా బహుళత్వే

దుశ్చస్యాత్॥ టీక॥ ఔపవిభక్తికలీనామ్ - ఔపవిభ

క్తికలివర్ణములకు - ఇల్లుక్ - ఇకారలోపమును - తథై

వ - అప్రకారముగానే - దుశ్చ - దువర్ణకమును బహు

ళమ్ - బహుళముగా - స్యాత్ - అగును. అనఁగా

నౌపవిభక్తికయోగ్యములైనలివర్ణములకులవర్ణకము

లుపరములగునపుడికారంబునకులోపంబునుబూర్ణబిం

దుసహితంబైనదువర్ణకంబునుబహుళముగావచ్చునని

తాత్పర్యము ఉ రోకలి రోకండ్లు - అటకలి - అట

కండ్లు - గొడ్డలి - గొడ్డండ్లు - ఇత్యాదులు బహుళ

గ్రహణముచేత - పెండిలి - పెండిండ్లు - అనియనౌపవి

భక్తికములకునువచ్చు.

౭౮॥ మూ॥ అపిసంయుక్తసమాప్తౌనాంయోన్తేలుః ప్ర

కృత్యైతేనామ్నామ్॥ టీక॥ నామ్నామ్ ప్రాతిపదికము

లయొక్క - అన్తే అంతమందు - లుః - లువర్ణకము

సంయుక్తసమాప్తోపి - సంయుక్తమయిము గిసినదైన ను - భూయః, మఱియు ప్రదృశ్యతే. కానఁబడుచున్న ది - అనఁగానామంబులకడపట మున్న సంయుక్తంబై ముగిసినదైననులువర్ణకంబుమఱలఁ గానంబడు చున్నద నితాత్పర్యము . ఉ. మొసళ్లులు - నెమళ్లులు - ముండ్లు లు - నీళ్లులు - ఇత్యాదులు ప్రదృశ్యతే అనుటవలననీ ప్రయోగము ప్రసిద్ధంబనుశంకవలదని భావము,

౭౯ ॥ మూ॥ కేషాంచిదుదన్తానాంనేతివిభక్తావునో లుక్స్యాత్ ॥ టీక ॥ కేషాంచిత్ - కొన్ని యయిన - ఉ దన్తానామ్ - ఉకారాంతశబ్దములకు - నేతివిభక్తౌ - న అనువిభక్తిపరమగుచుండఁగా - ఉనః - ఉన్ అనుదా నికి - లుక్ - లోపము - స్యాత్ - అగును। అనఁగా ను కారాంతంబులగుకొన్ని శబ్దంబులకు నఅనుసప్తమీవిభ క్తిపరమగునపుడునామాంతమందున్న యుకారంబున కునువిభక్త్యాదియందున్న నకారంబునకును లోపంబ గలుగునని తాత్పర్యము . ఉ. చోటు - న . చోట - మీఁ

ము. న. మీఁద - ఊఁగు. న - ఊర - క్రిందు. న - క్రింద - ఇత్యాదులు - శేషాంచిత్తనుటవలన ఇకార రూపౌపవి భక్తికవంతంబులకువచ్చుఁగాని కొంగున వైపున వీపున నిత్యాదులందురాదు.

౮౦ ॥ మూ ॥ ఔపవిభక్తికనామ్నా - మత్వంస్యా త్సప్తమీతృతీయార్థే ॥టీక॥ ఔపవిభక్తికనామ్నామ్ ఔపవిభక్తిక ఔపవిభక్తికాంతములైన నామ్నామ్ ప్రాతిపదికములకు - సప్తమీతృతీయార్థే - సప్తమీ - సప్తమ్యర్థమందును - తృతీయార్థే - తృతీయార్థమందును - అత్వమ్ - అత్వము - స్యాత్ అగును। అనఁగానౌపవిభక్తికాంతంబులగు నామంబులకు - సప్తమ్యర్థతృతీయార్థములయందత్వంబువచ్చునని తాత్పర్యము - ఉ మింటఁ - పంటఁ - కంటఁ - వింటఁ నీటఁ చేతఁ - ఇత్యాదులు,

౮౧ ॥ మూ॥ అనుతాం స్త్రీయాం సమాసాం సర్వ స్య స్త్రీసమస్యచసులోపః ॥టీక॥ అనుతామ్. ఉకా

రాంతములుగాని - సమానామ్ - తత్సమముల యిన - స్త్రియామ్ . స్త్రీలింగశబ్దములకును - సర్వస్య - సమస్తమైన స్త్రీ సమస్యచ . స్త్రీ సమమునకును - సులోపః - సుప్రత్యయలోపము - స్యాత్ - అగును | అనఁగాను కారాంతవ్యతిరిక్తంబులును సంస్కృతప్రాకృతతత్సమంబులునగు స్త్రీలింగశబ్దంబులకును స్త్రీ సమంబులైన సమస్తదేశ్యశబ్దంబులకు నుసులోపంబుగలుగునని తాత్పర్యము ॥ అంబ - రమ - గౌరి - వాణి - జడ - రాణి - లచ్చి - గోడ - మేడ - బావి - మోవి - ఊరు - ఇత్యాదులు.

౮౨ ॥ సూ ॥ ఏదన్తతాచనామ్నామన్యతరస్యామియాన్తానామ్ ॥ టీక ॥ ఇయాన్తానామ్ - ఇయాంతములైన - నామ్నామ్ - ప్రాతిపదికములకు . అన్యతరస్యామ్ - వికల్పముగా . ఏదన్తతాచ . ఏకారాంతత్వమును - స్యాత్ - అగును। అనఁగానియాంతంబులగుశబ్దంబులకియ్యులనుదానికే కారాదేశంబును . ఇకారము వ

లనని కారణంబునకులోపంబునువికల్పముగానగుననితా
త్పర్యము ఉ - విడియము - విడెము - విడ్యము - ముత్తి
యము ముత్తెము - ముత్త్యము - కడియము - కడెము
కడ్యము మిరియము - మిరెము - మిర్యము కన్నియ
కన్నె - కన్న్య వన్నియ - వన్నె - వన్న్య ఇత్యా
దులు.

౮౩॥ సూ॥ వికృతౌ సర్వే శబ్దాః క్లీబసమాః స్త్రీసమా
శ్చనాన్యేస్యుః॥ టీక॥ వికృతౌ ఆంధ్రమందు - స
ర్వే సమస్తములయిన - శబ్దాః - శబ్దములు - క్లీబస
మాః నపుంసక - సమములు - స్త్రీసమాశ్చ - స్త్రీ
సమములునుగా - స్యుః - అగును। అన్యే - ఇతరము
లు - నస్యుః - కలుగవు - అనఁగా దేశ్యభాషయందన్ని
శబ్దంబులునపుంసక లింగసమములును స్త్రీ లింగసమ
ములునుగా నుండునుబుంలింగ సమములులేవు తత్సమ
సంబంధముచేఁ బడిత్యాదిపుంసమంబులును గలవని తా
త్పర్యము.

౮౪॥మూ॥ క్లీబసమా అమహద్వత్ ॥టీక॥క్లీబసమాః నపుంసకసమములు - అమహద్వత్ - అమహచ్ఛబ్దంబులవలె - స్యుః - అగును . అనఁగా నపుంసకసమములగు - దేశ్యశబ్దంబులు నపుంసకతత్సమశబ్దంబులవలె మువర్ణాంతంబులుగా నుండునని తాత్పర్యము - ఉ . అంగము . చందము గుఱ్ఱము - పల్లము . ఇత్యాదులు-

౮౫॥ మూ॥ స్త్రీవత్స్యుః స్త్రీసమాః॥ టీక॥ స్త్రీసమాః - స్త్రీసమములు - స్త్రీవత్ స్త్రీలింగములవలె స్యుః - అగును - అనఁగా స్త్రీసమంబులగు దేశ్యశబ్దంబులు తత్సమ స్త్రీలింగసమములుగా నగునని తాత్పర్యము . ఉ . గోడ - మేడ . తావి . బావి - మోవి- మోపు - దాపు - నేల - నవలా - ఇత్యాదులు -

౮౬॥ మూ॥ సమాస్తుసమాః॥ టీక॥ సమాస్తు - తత్సమములయితే - సమాః - సమాన లింగములు గలవిగా . స్యుః - అగును - అనఁగాఁ దత్సమశబ్దంబులు ప్రకృతితోడ సమానమైన లింగము గలవిగా నుండునని తా

త్పర్యము . ఉ - రాముఁడు - సీత - రఘు.కులము - జ
ముఁడు . జడ . కారము ఇత్యాదులు-

౮౭॥ మూ॥ ఇతి శ్రీసకలభాషావాగనుశాసననన్నయ భట్టవిరచితాన్ధ్ర శబ్దచిన్తామణౌతృతీయోజన్త పరిచ్ఛేదః॥ టీక॥ శ్రీసకలభాషా వాగనుశాసనుఁడగు నన్నయ భట్టారకుచేతవిరచింపఁబడినయాంధ్రశబ్దచింతామణి యందు మూఁడవది యైన యజంత పరిచ్ఛేదము ముగిసెను-

---

## హలంతపరిచ్ఛేదము.

---

౧॥ మూ॥ ప్రథమైకవచనతుల్యంసర్వత్ర హలన్తమగుణవత్ప్రభృతి ॥టీక॥ సర్వత్ర అంతట . అగుణవత్ప్రభృతి గుణవదాదివ్యతిరిక్తమైన . హలన్తమ్ . హలంతశబ్దము . ప్రథమైక వచన తుల్యమ్ - ప్రథమైకవ

చన - సంస్కృతప్రథమైకవచనముతోడ - తుల్యమ్ సమానము . భవేత్ . అగును| అనఁగా సంస్కృతప్రథమైకవచనము తెనుఁగునం దేశబ్దములకుఁ బ్రాతిపదికం బగుచున్నదో అట్టిహలంతశబ్దంబులగుణవర్ణనమని తాత్పర్యము . ఉ . కకుప్ . దిక్ . దృక్ . ఉపానత్ - ఇత్యాదులు.

౩|| సూ|| గుణవర్ణనో ద్వితీయైకవచనతుల్యో భవేద్వికృతౌ ||టీక|| వికృతౌ - ఆంధ్రమందు - గుణవర్ణనః - గుణవర్ణము - ద్వితీయైకవచనతుల్యః - ద్వితీయైక వచన సంస్కృతద్వితీయైకవచనముతోడ . తుల్యః - సమానము - భవేత్ - అగును| అనఁగా సంస్కృతద్వితీయైకవచనము తెనుఁగునం దేశబ్దములకుఁ బ్రాతిపదికం బగుచున్నదో అట్టిహలంతశబ్దములు - గుణవర్ణమని తాత్పర్యము ఉ . గుణవంతమ్ . సుహృదమ్ . వేదవిదమ్ ఋత్విజమ్ విద్వాంసమ్ . అనడ్వాహమ్ . శ్వానమ్ - పుంసమ్ . ఇత్యాదులు.

౩ ॥ మూ॥ ద్విత్వోత్వే సర్వహలాం హ్రస్వాత్ ॥ టీక॥ హ్రస్వాత్ హ్రస్వముకంటెఁ - బరములయిన - సర్వహలాన్ - సమస్త హల్లులకు - ద్విత్వోత్వే - ద్విత్వోత్వములు స్తః - అగుచున్న వి। అనఁగాగుణవర్ణణవ్యతిరిక్తసంబంధులై హ్రస్వంబుకంటెఁ బరంబులైనహల్లులకెల్ల ద్విత్వోత్వంబులు వచ్చునని తాత్పర్యము ఉ కకుప్పు - దిక్కు - దృక్కు - ఉపానత్తు ఇత్యాదులు వీనికిసుఁగాగంబుమీఁదఁ జెప్పంబడు-

౪ ॥ మూ ॥ ద్విత్వంతు దీర్ఘతో బహుళమ్ ॥ టీక ॥ దీర్ఘతః దీర్ఘముకంటెఁబరములైనహల్లులకు ద్విత్వంతు - ద్విత్వమైతే బహుళమ్ - వికల్పముగాస్యాత్ అగును , అనఁగాదీర్ఘంబుకంటెఁ బరంబులైన హల్లులకు ద్విత్వంబువికల్పంబుగానుత్వంబునిత్యంబుగా వచ్చునని తాత్పర్యము - ఉ - వాకు వాక్కు . ఇత్యాదులు.

౫ ॥ మూ ॥ అగుణవతాంసర్వహలాంస్తోగ్లోపః॥టీ॥ అగుణవతామ్ గుణవర్ణణవ్యతిరిక్తములైన సర్వహ

లామ్ - సమస్తహలంతశబ్దములయొక్క . సోః - సుప్ర
త్యయంబునకు . లోపః - లోపము స్యాత్ . అగును.
అనఁగాగుణవర్గణ వ్యతిరిక్తంబులైన హలంత శబ్దముల
ప్రథమైకవచనంబునకు లోపంబు వచ్చునని తాత్ప
ర్యము.

౬ ॥ సూ ॥ గుణవతాం డుమూ ప్రాగ్వత్ ॥ టీక ॥ గు
ణవతామ్ . గుణవర్గణశబ్దములకు . డుమూ - డుమువ
ర్ణకములు . ప్రాగ్వత్ . మును పటివలె - స్తః - అగు
చున్నవి - అనఁగా గుణవర్గణ శబ్దంబులకు మునుపటివ
లెమహచ్ఛబ్దంబులకు డువర్ణకంబును - అమహచ్ఛబ్దం
బులకుమువర్ణకంబును వచ్చునని తాత్పర్యము . ఉ . గు
ణవంతుఁడు . సుహృదుఁడు - వేదవిదుఁడు . ఋత్వి
జుఁడు . విద్వాంసుఁడు . అనడ్వాహము - శ్వానము -
పురము . ఇత్యాదులు ఇచట - అన్యేషాంచ ప్రయోగ
మహితానామ్ . అనువక్ష్యమాణసూత్రముచేత మకా
రంబునకు లోపంబుగలుగుచున్నదని యెఱుఁగునది,

౭ ॥ మూ ॥ ఆత్మన ఇమనన్తా నాండావా ॥ టీక ॥ ఆత్మనః ఆత్మన్ శబ్దమునకు. ఇమన న్తా నామ్ ఇమన్నంతములకు, డా. డాప్రత్యయము, వా. వికల్పముగా, స్యాత్. అగును అనఁగా ఆత్మశ్శబ్దంబునకును ఇమని చ్ప్రత్యయాంత శబ్దంబులకును డా ప్రత్యయంబువికల్పంబుగావచ్చునని తాత్పర్యము ' ఈప్రత్యయమును వర్ణకమువలెఁ బ్రథమైక వచనమునకాదేశంబుగాని తరవిభక్తులయందాగమంబుగావచ్చును - డకారంబిత్తుగాపునదానికిలోపంబును. ప్రత్యయంబుడిత్తు గావునఁ బిలోపంబునుదీర్ఘాణామిత్యాదిసూత్రముచేతహ్రస్వంబునుగలుగును ' ఉ. ఆత్మ | ఆత్మలు । మహిమ మహిమలు గరిమ | గరిమలు | ఇత్యాదులు । డాప్రత్యయంబులేనిపక్షమందు । అన్యేషాంచ వాలు గంతస్యఅనుసూత్రముచేతనకారంబునకు లోపంబువచ్చును | ఉ | ఆత్మము | మహత్త్వవివక్షయందు | ఆత్ముఁడు మహిమము | గరిమము | ఇత్యాదులు|

౮.॥ మూ॥ డుస్స్యాత్సదా రాజ్ఞః॥ టీక॥ రాజ్ఞః. రాజన్ శబ్దమునకు - డుః - డుప్రత్యయము - సదా - నిత్యముగా.. స్యాత్ - అగును - అనఁగా రాజన్ఛబ్దంబునకు డుప్రత్యయంబు నిత్యంబుగా వచ్చునని తాత్పర్యము ఈప్రత్యయము డాప్రత్యయమువలెనే యని యెఱుఁగునది. ఉ - రాజు. రాజులు - ఇత్యాదులు.

౯॥మూ॥ సాన్తాదపయఃప్రభృతేస్లోపః॥ టీక ॥ అపయఃప్రభృతేః - పయోగణవ్యతిరిక్తమయిన సాన్తాత్ - సకారాంతశబ్దముయొక్క - స్లోపః. సకారలోపము - స్యాత్ - అగును - అనఁగాఁబయోగణవ్యతిరిక్తసకారాంతశబ్దాంతమందున్న సకారంబునకు లోపంబువచ్చునని తాత్పర్యము - ఉ - తేజము - యశము - మనము శిరము - ధనువు - ఇత్యాదులు. ఇచటనుత్తరసూత్రమందలి వాకారంబపకర్షింపఁబడుటవలననీకార్యంబు వైకల్పికముగావున సకారలోపములేని పక్షమందు ద్విత్వములు రాఁగాఁ దేజస్సు - యశస్సు - మనస్సు

శిరస్సు - ధనుస్సు అని యును ద్విత్వంబు దీర్ఘతో బహు
ళము నుబహుళ గ్రహణమువలన - మనసు - సదసు - శి
రసు అనియును రూపంబగు.

౧౦॥మూ॥ అన్యేషాంచ వాలుగన్త్యస్య ॥టీక॥ అన్యే
షాంచ. ఇతరశబ్దములయు అన్త్యస్య. అంత్య వర్ణము
నకు - లుక్ లోపము. వా - వికల్పముగా. స్యాత్
అగును - అనఁగా సకారాంతశబ్దంబులకంటె నన్యం
బులగును కొన్ని హలంత శబ్దంబులయంత్యవర్ణంబున
కులోపంబు వికల్పంబుగానగునని తాత్పర్యము ౼ జగ
ము జగత్తు ఇత్యాదులు చకారము వలన సంఖ్యాహ
ల్లుకంటెఁ బూర్వంబైనయచ్చునకు జంతరంబును వచ్చు
ఉ [?] - పధము ఇత్యాది - ఈ హల్లోపము కొన్నియెడల
నిత్యంబు-

౧౧॥మూ॥ ప్రాకృతభవసంస్కృతభవసంస్కృత
వత్ప్రాకృతభవవికృతిభవాః॥ టీక॥ ప్రాకృతభవవి
కృతిభవాః - ప్రాకృతభవ - ప్రాకృతమందుఁ బుట్టిన

వికృతి తెనుఁగునందు-భవాః పుట్టినశబ్దములు ప్రాకృత
భవ సంస్కృతభవ సంస్కృతవత్ - ప్రాకృతభవవత్
ప్రాకృతభవములవలె సంస్కృతభవవత్ సంస్కృ
తభవములవలె - సంస్కృతవత్ సంస్కృతములవలె
స్వ్యా॰ అనఁగా ప్రాకృతభాషవలనఁబుట్టిన తె
నుఁగుశబ్దములు ప్రాకృత దేశీయ సమములును సంస్కృ
తభవ ప్రాకృత సమములును సంస్కృతసమ ప్రాకృత
సమప్రాకృతసమములునైయుండు నని తాత్పర్యము.
ఉ. అంబరము - జముఁడు - అహెబూ. ఇత్యాదులు.
౧౦॥ మూ॥ వ్యతిరిక్తాభూయాంసః॥ టీక ॥ వ్యతిరిక్తాః
ఇతరములగు నతద్భవములు - భూయాంసః - పెక్కు
లై - సంతి - ఉన్నవి - అనఁగా వర్ణాగమలోపంబుల
చేత నించుక వికారంబు నొందిన ప్రాకృతశబ్దంబులు
ప్రాకృతభవవ్యపదేశ్యంబులై పెక్కులుగా నుండుచు
న్న వని తాత్పర్యము - ఉ. కుబ్జః - కుజ్జో - గుజ్జు - సిం
హః - సింఘో - సింగము - లాఙ్ఘొలఙ్ఘా - ... వటు

వడు - వడుగు . ఋక్షమ్ - రిక్షమ్ . రిక్క - ఇత్యాదులు.

౧౩॥ మూ॥ వ్యతిరిక్తాస్సంప్రదాయతో వేద్యాః॥టీక॥ వ్యతిరిక్తాః ఇతరములు సంప్రదాయతః శిష్టోపదేశపగంపరవలన - వేద్యాః-ఎఱుఁగఁదగినవి - అనఁగా సంస్కృతభవంబులును దేశ్యంబులునులింగభేదాదివిశేషంబులును సంప్రదాయవేద్యములని తాత్పర్యము . ఉ . చందురుఁడు . సంద్రము - ఇత్యాదిశబ్దంబులుసంస్కృతభవంబులు . అంమగోడఇత్యాదులు స్త్రీలింగంబులుచంపము ఇత్యాదులు దేశ్యంబులుఅందుమేడఇత్యాదులు స్త్రీలింగంబులు -

౧౪ ॥ మూ ॥ దేశ్యాదస్మద్యుష్మచ్ఛబ్దాత్సుజసోర్నుమూవురూ చ స్తః॥ టీక॥ దేశ్యాత్ - దేశ్యములయిన అస్మద్యుష్మచ్ఛబ్దాత్ - అస్మద్యుష్మచ్ఛబ్దములకంటెఁబరములయిన - సుజసోః - ప్రథమైకవచనబహువచనములకు - నుమూ - నుము అనునవియును - వురూచ

వురు అనునవి యునుస్త్వః - అగుచున్నవి - ఆసఁ గాఁడే
శ్శ్యాస్మచ్ఛబ్దంబైన నాఅను దానిప్రథమైకవచనప్రథ
మాబహు వచనములకుఁ గ్రమముగా . ను - ము .
అనువర్ణకములు వచ్చును దేశ్యయుష్మచ్ఛబ్దంబయిన నీ
అను దానిప్రథమైకవచనప్రథమాబహువచనములకుఁ
గ్రమముగా - వు - రు . అనువర్ణకములు వచ్చునని తా
త్పర్యము - ఉ - నేను - మేము నీవు - మీరు | ప్రథ
మాయామేదస్మదః | అనియస్మచ్ఛబ్దంబున కేత్వంబు
ను . ఏతయోర్బహుత్వేమః అని బహువచనమందు
మకారంబును సీఁసఁ జెప్పంబడఁగలదు | యుష్మచ్ఛబ్ద
బహువచనమందు | మీరలుఅనియు నొకరూపంబు
గలదు |

౧౫|| సూ|| న్నమ్యా ప్రాస్వశ్చాదేరమిశసిచ ||టీక॥
అమి | ద్వితీయైక వచనమునకు శసిచ | ద్వితీయా బ
హువచనమునకు | న్నమ్యా | న్నమ్యు | అనునవి స్తః
అగుచున్నవి | ఆదేః | మొదటి దానికి | ప్రాస్వశ్చ |

హ్రస్వమును - స్యాత్ - అగును. అనఁగా నాసీశబ్దంబుల ద్వితీయైకవచనమునకు - న్ను అనువర్ణకమును ద్వితీయా బహువచనమునకు . మ్ము . అనువర్ణకమును వచ్చునను ముందున్న దీర్ఘమునకు హ్రస్వంబును వచ్చునని తాత్పర్యము ఉ నన్ను - మమ్ము నిన్ను - మిమ్ము .

౧౬॥ సూ॥ అన్యతరలుక్ప్రయుక్తస్య॥టీక॥యుక్తస్య - సంయుక్తము యొక్క - అ న్యతరలుక్ - రెంటిలోనొక దానికిలోపమును - స్యాత్ - అగును . అనఁగా ద్విత్వ యుక్తములైన - న్ను మ్ము అనువర్ణములలో రెంటిలో నొకవర్ణమునకు లోపము వికల్పంబు గావచ్చునని తాత్పర్యము ఉ నను - మము నిను మిము

౧౭॥ సూ॥ కిగ్న జసుకి॥టీక॥ జసుకి - షష్ఠీ విభక్తికి - కిః కివర్ణకము - న్న - లేదు - అనఁగా షష్ఠీ విభక్తికిఁ గివర్ణకం బు రాదని తాత్పర్యము ఉ - నాకు మాకు నీకు మీకు ఇతాంజసఃకిశ్చ అనుసూత్రము చేతయుష్మదస్మ చ్ఛబ్దంబున కుఁ గివర్ణ కంబు రాఁగానది దీనిచేత నిషేధింపఁబడినది

॥ మూ॥ ప్రథమాయామేదస్మదః॥టీక॥ ప్రథమాయామ్. ప్రథమావిభక్తిపరమగుచుండఁగా అస్మదః అస్మచ్ఛబ్దమునకు ఏత్ - ఏకారాదేశము. స్యాత్ - అగును. అనఁగా నస్మచ్ఛబ్దంబునకుఁ బ్రథమావిభక్తిపరమగునపుడే కారంబంతాదేశంబుగా వచ్చునని తాత్పర్యము - ఉ, నేను । మేము - సర్వాదేశంబనికొందఱం గీకరింతురు. ఉ - ఏను - ఏము. యుష్మచ్ఛబ్దంబునకును ఈవు. ఈరు . అను రూపంబుగలదు.

౧౯ ॥మూ॥ ఏతయోర్బహుత్వేమః॥టీక॥ఏతయోః - ఈ రెంటికి - బహుత్వే - బహువచనముపరమగుచుండఁగా. మః - మకారము - స్యాత్ - అగును. అనఁగా నీయస్మద్యుష్మచ్ఛబ్దంబులకు బహువచనముపరమగునపుడు మకారంబాదేశంబుగావచ్చునని తాత్పర్యము - ఉ - మేము. మమ్ము - మాచేత మాకొఱకు. మీరు. మిమ్ము - మీచేత. మీకొఱకు. ఇత్యాదులు.

౨౦॥ మూ॥ హ్రస్వేటాదౌనమవాఽ ద్వయవద్వచ

నద్వయేన్యయోరాత్మా॥ టీక ॥ ఆత్మా. ఆత్మన్శబ్దము టాదౌ, తృతీయాదివిభక్తిపరమగునపుడు. హ్రస్వే హ్రస్వము గలుగఁగా. వచనద్వయే. రెండు వచనముల్యయందు, నమవాన్. నకార మకారములుగలదిగా. స్యాత్ అగును - అన్యయోః - ఇతరవిభక్తులయందు - ద్వయవత్. అస్మద్యుష్మచ్ఛబ్దంబులవలె. స్యాత్ - అగును. అనఁగాదేశ్యాత్మన్శబ్దంబయిన తా అనునది తృతీయమొదలగువిభక్తిపరమగునపుడు హ్రస్వమునుబొంది ఏకవచనమందునకారంబుగలదిగా బహువచనమందు మకారంబుగలదిగానగును ప్రథమాద్వితీయలుపరములగునపుడేకవచనమందస్మచ్ఛబ్దంబువలె బహువచనమందుయుష్మచ్ఛబ్దంబువలెనగుననితాత్పర్యము, ఉ తాను తారు తన్ను. తను. తమ్ము తము తనచేత-తమచేత ఇత్యాదులు ఇచటద్వయవత్ అనుసామాన్యోక్తిచేఁగాము అనియును రూపంబుగలదు.

౨౧॥ సూ ॥ భూయసశ్చభయార్థవాచీయఃకశ్చిచ్ఛబ్దోవ

తినిత్యబహువచనః। తస్యజసోముశసోల ॥ టీక ॥ భూయః - తలుచుగా, ఉభయార్థ వాచీ యుష్మదస్మదర్థకమైన నిత్య బహువచనః- నిత్య బహువచనాంతమైనయః . ఏ . కశ్చిత్ - ఒకానొక శబ్దము - భవతి - కలదో . తస్య - దానియొక్క . జసః ప్రథమాబహువచనమునకు . ము - ము వర్ణకమును - శసః ద్వితీయా బహువచనమునకు ల - లవర్ణకమును . స్యాత్ - అగును . అనఁగాయుష్మదస్మదులయొక్క యర్థద్వయము నకును వాచకమైనిత్యబహువచనాంతమైనమనయను దేశ్యశబ్దంబేదిగలదో దాని ప్రథమాబహువచనమునకు మువర్ణకంబునుద్వితీయాబహువచనంబునకులవర్ణకంబును వచ్చునని తాత్పర్యము . ఉ - మనము . మనల -

౨౨ ॥ మూ ॥ ప్రాగ్వత్స్యాంభిసాదికేన్యత్ర॥ టీక ॥ భిసాదికే . తృతీయాబహువచనము మొదలుగాఁగల. అన్యత్ర - ఇతరవిభక్తిపరమగునపుడు - స్యామ్ "స మాసము - ప్రాగ్వత్ . మునుపటివలె . స్యాత్ అ

గుసు । అనఁగాఁదృతీయాబహువచనాదివిభక్తిపరంబగునపుడుసర్వంబు నుయుష్మదస్మచ్ఛబ్దవత్తుగాన గును నితాత్పర్యము .ఉ. మనచేత, మనకొఱకు. మనవలన । ఇత్యాదులు ।

౨౧౨॥ సూ॥ కవిభల్లటైః క్రియాణాం నామ్నాంచోల్లోపఇష్యతే హ్యేషు. ప్రథమైకవచనమాత్రేవికృతౌనాన్తాదయోపికథ్యన్తే టీక॥ వికృతౌఅం ధ్రమందు కవిభల్లటైః కవిభల్లటులచేత క్రియాణామ్ క్రియాపదములకును - నామ్నాంచ - ప్రాతిపదికములకును - ఉల్లోపః - ఉకారలోపము - ఇష్యతే హి - కోరఁబడు చున్నదిగదా - ఏషు - ఈలోపస్థలములందు - ప్రథమైకవచనమాత్రే - ప్రథమైకవచనమాత్రమందు నాన్తాదయోపి నకారాంతాదులునుకథ్యన్తే - చెప్పఁబడుచున్నవి - అనఁగాఁగవిభల్లటులని రెండు పురాతనలాక్షణికులచేతఁ జెనుఁగునందుఁ గ్రియాపదంబులయు నామంబులయును కారంబునకులోపంబంగీకరింపఁబడు

చున్నదియట్టిలోపప్రదేశములయందునామంబులయం
దద్విత్వంబునైననకారాంతాదిశబ్దములు ప్రథమైకవ
చనమందే కానఁబడుచున్నవని తాత్పర్యము హిశబ్దము
ప్రయోగప్రసిద్ధినిఁ దెలియఁజేయుచున్నది - ఉ - చూడ
ఙ్గనులు . వత్తుర్మనులు . సేవింతుర్మ - రాముని . కన్దె
అది . చన్గడిచి . ఇత్యాదులు ఆదిశబ్దము చేత లాం
తాములనుగ్రహింపఁబడు - ఉ - క ద్రా వి . విల్పొని
పేర్వాడి గోర్మోపి ఇత్యాదులు.

౨౮॥ మూ॥ ఇదమదసేతద్యత్తచ్ఛబ్దాశ్చ బ్దాన్తరాన్వ
యేబహుళమ్ . హ్రస్వం ప్రపద్య దీర్ఘాద్విత్వముపర్య
క్షరస్యజనయంతి ॥టీక॥ శబ్దాన్తరాన్వయే . మఱియొ
కశబ్దముతోనన్వయముగలుగుచుండఁగా - దీర్ఘాః . దీ
ర్ఘాంతములైన - ఇదమదసేతద్యత్తచ్ఛబ్దాః . ఇదమద
సేతద్యత్తచ్ఛబ్దార్థములైనఈపఆ - అనుశబ్దములు - బ
హుళమ్ . వికల్పముగా - హ్రస్వమ్ - హ్రస్వము
ను - ప్రపద్య . పొంది - ఉపర్యక్షరస్య మీఁదియ

తీరమునకు - ద్విత్వమ్ - ద్విత్వమును - జనయంతి - పుట్టించుచున్నవి, అనగా ఇదమ్ అదస్ - ఏతత్ - వీనికి దేశ్యశబ్దంబు ఈ అనుశబ్దంబును. యత్ అనుదాని దేశ్యశబ్దంబు ఏ అనుశబ్దంబును - తత్ - అనుదాని దేశ్యశబ్దంబు ఆ అనుశబ్దంబును మఱియొకశబ్దంబుతో నన్వయించునపుడు తాము హ్రస్వమును బొంది మీఁది వర్ణమునకు వికల్పముగా ద్విత్వమును బుట్టించుచున్నవని తాత్పర్యము ఉ, ఈ దేశము ఇద్దేశము - ఏ దేశము - ఎద్దేశము ఆ దేశము - అద్దేశము - ఆ కాలము - అక్కాలము - ఏయమరులు - ఎయ్యమరులు - ఇత్యాదులు - బహుళగ్రహణము చేత శబ్దాంత రాన్వయము లేకున్నను ద్విత్వము - ఉ - ఏది - ఎద్ది - ఇది - ఇద్ది. అది - అద్ది - ఇత్యాదులు - ఈ కార్యము శషసహరఋకారంబులు పరములగునపుడు లేదు - ఉ - ఆషణ్ముఖుఁడు - ఆశంకరుఁడు - ఆ సేన - ఆ హయము - ఆ రాజు - ఆ ఋషి - ఇత్యాదులు.

౨౫॥ మూ॥ దిస్స్యాత్సంబన్ధార్థే సర్వస్మాత్ ॥ టీక- సర్వస్మాత్ - సమస్తశబ్దముమీఁద - సంబన్ధార్థే - సంబంధార్థమందు - దిః - దివర్ణకము - స్యాత్ - అగును - అనఁగా సమస్తశబ్దంబులమీఁద సంబంధార్థమందు దివర్ణకంబువచ్చునని తాత్పర్యము - ఉ - రాజుది. బంటుది - ఇత్యాదులు.

౨౬॥ మూ॥ యుష్మదస్మదాత్మభ్యః ద్వితివర్ణకః ॥ టీక యుష్మదస్మదాత్మభ్యః - యుష్మదస్మదాత్మన్శబ్దములమీఁద - ద్వితివర్ణకః - దు అనువర్ణకము - స్యాత్ - అగును - అనఁగా దేశ్య యుష్మదస్మదాత్మన్శబ్దంబులైన నీ నా తా అను వానిమీఁద సంబంధార్థమందు దువర్ణకంబువచ్చునని తాత్పర్యము - ఉ - నాదుసొమ్ము - నీదుకీర్తి - తనదుమహిమ - ఇత్యాదులు - దిస్స్యాత్తను పూర్వసూత్రమందు సర్వస్మాత్తనుటవలన దివర్ణకంబు వీనికి నొకపక్షంబున వచ్చును - ఉ - నీది - నాది - తనది ఇత్యాదులు.

౨౭ ॥ మూ॥ అ ఇ ఉ స్త్రీ విషయాః ॥ టీక॥ అ. ఇ ఉ అకార ఇకార ఉకారములు స్త్రీవిషయాః. స్త్రీ లింగద్యోతకములు. స్యుః. అగును అనఁగా అ ఇ ఉ అను వర్ణములులోకప్రసిద్ధవ్యావహారికనామాంతములం దువర్తించుచున్నవని తాత్పర్యము. ఉ. గౌర. గౌరి. గౌరు. లచ్చ. లచ్చి. లచ్చు. ఇత్యాదులు.

౨౮ ॥మూ॥ త్వార్థేతనశ్చవికృతౌస్యాత్ ॥టీక॥ వికృతౌ. ఆంధ్రమందు. త్వార్థే. త్వప్రత్యయార్థమందు. తనశ్చ. తనవర్ణకము. స్యాత్. అగును. అనఁగాఁదెనుఁగునందుఁద్వప్రత్యయార్థంబునందుఁదనవర్ణకంబువచ్చునని తాత్పర్యము ఉ. పెద్దతనము. పిన్నతనముదొరతనము. ఇత్యాదులు.

౨౯ ॥మూ॥నామ్నఃకవర్ణకస్స్యాత్స్వార్థేస్యాదత్వమపి పరేతస్మిన్ ॥టీక॥ నామ్నః. ప్రాతిపదికముమీఁదను స్వార్థే. స్వార్థమందు కవర్ణకః. కవర్ణకము. స్యాత్. అగును. తస్మిన్. ఆకవర్ణకము. పరేసతి. పరముగా

చుండఁగా - ఉత్వమపి - ఉకారమును - స్యాత్ - అగు
ను - అనఁగాఁబ్రాతిపదికంబుమీఁదనువర్థమందుఁగవ
ర్ణకంబువచ్చునాకవర్ణకంబు - పరంబగునపుడుకారా
దేశంబునువచ్చునని తాత్పర్యము . ఉ - వెలఁది - వె
లఁదుక - నెలఁత. నెలఁతుక - పొలఁతి . పొలఁతుక . ఇ
త్యాదులు.

౩౭ ॥ మూ॥ చురితిక్రియాపదానాంసర్వేషాంవర్త
మాన కాలేస్యాత్ ॥టీక॥ సర్వేషామ్ - సమస్తముల
యిన . క్రియాపదానామ్ - క్రియా పదములకు - వర్త
మానకాలే - వర్తమాన కాలమందు - చురితి - చు అని
స్యాత్ - అగును అనఁగాసమస్తములైన క్రియలకు-
వర్తమానార్థమందు చువర్ణకంబువచ్చునని తాత్పర్యము
ఉ జయించుచున్నాఁడు - గెలుచుచున్నాఁడు-కొట్టు
చున్నాఁడు . చేయుచున్నాఁడు - జయించుచు - గెలు
చుచు - ఇత్యాదులు.

౩౮ ॥మూ॥ ప్రతిషేధవాచినాంనిః ॥టీక॥ ప్రతిషేధ

వాచినామ్ - వ్యతిరేకమును జెప్పునట్టి క్రియాపదముల కు - నిః - నివర్ణకము . స్యాత్ - అగును అనఁగా వ్యతిరేకార్థకములైన క్రియావిశేషణములకు నివర్ణకంబు వచ్చునని తాత్పర్యము ఉ - జయింపనివాఁడు గెలువని వాఁడు కొట్టనివాఁడు, చేయనివాఁడు - ఇత్యాదులు.

౩౨ ॥మూ॥ భూతార్థానాంతునః క్రియాణాంస్యాత్ టీక॥ భూతార్థానామ్, భూతార్థకములైన . క్రియాణాంతు . క్రియాపదములకయితే - నః నవర్ణకము. స్యాత్ - అగును - అనఁగా భూతార్థకములైన క్రియావిశేషణములకు నవర్ణకంబు వచ్చునని తాత్పర్యము ఉ. జయించినవాఁడు - గెలిచినవాఁడు కొట్టినవాఁడు- చేసినవాఁడు - ఇత్యాదులు.

౩౩ ॥ మూ॥ కర్మాదేః కర్తృత్వం ప్రథమాచ నవర్ణకశ్చతద్వత్స్యాత్ ॥ టీక॥ కర్మాదేః - కర్మాదికి కర్తృత్వమ్ - కర్తృత్వమును - ప్రథమాచ . ప్రథమయును నవర్ణకశ్చ . నవర్ణకమును తద్వత్ - దానివలె స్యాత్,

అగును. అనఁగా విశేషణంబులగు క్రియలకర్మాదుల కుఁగర్తృత్వంబువచ్చును వాస్తవికకర్తృవాచకంబు మీఁదఁబ్రథమవచ్చును భూతార్థకక్రియాజన్యవిశేషణ ములకునవర్ణకంబుమునుపటివలెవచ్చునని తాత్పర్యము ఉ - నీవునుతించినరాజు. నీచేతనుతింపఁబడినరాజని యర్థము ఇచ్చోటనుతియందుఁగర్మంబయినరాజునకుఁ గర్తృత్వంబతిదేశించుటంజేసి షష్ఠ్యనుబంధంబులేన య్యె - వాస్తవికకర్తృవాచకపదంబు మీఁదఁదృతీ యావిభక్తిప్రసక్తముగాఁగాదానికినీసూత్రముచేతఁ బ్రథమయును విధింపఁబడియె భూతార్థమునవర్ణక మువచ్చుననుటనివర్ణకాదులకుపలక్షణము - నీవునుతిం పనిరాజు - నీవుచేయుకార్యము - నీవుచేయుచున్న కా ర్యము - ఇత్యాదులు - ఆదిపదముచేతఁగరణాదులకు గ్రహణంబు - నీవుప్రహరించినఖడ్గము - ఇచటఁగరణం బునకును - నీవుగోవునిచ్చినబ్రాహ్మణుఁడు ఇచటసం ప్రదానమునకును - నీవుపూలుగోసినచెట్టు - ఇచటన

పాదానంబునకును నీవు భుజించినచోటు - ఇచటనధి
కరణంబునకు నుగర్తృత్వంబు.

౩౮ ॥ సూ ॥ షష్ఠీభవేద్ద్వితీయా తుల్యా తత్పురుష
సంస్థితానామ్నామ్ ॥ టీక ॥ నామ్నామ్ - ప్రాతిపదిక
ములయొక్క తత్పురుష సంస్థితా తత్పురుష సమా
సమందున్న షష్ఠీ షష్ఠీవిభక్తి ద్వితీయా తుల్యా-ద్వితీ
యా - ద్వితీయా విభక్తితోడ తుల్యా సమానము
గా - భవేత్ - అగును - అనఁగా ప్రాతిపదికంబుల
తత్పురుష సమాసమందున్న షష్ఠీ విభక్తి ద్వితీయావి
భక్తితోఁ దుల్యంబు గానగునని తాత్పర్యము - ఉ రా
మునిగుణములు - రామునిగుణములు - రాములగుణము
లు - విష్ణురాణి - కవినేర్పు - ఇత్యాదులు.

౩౯ ॥ సూ ॥ ఇదుపోత్తమోత్తమానాం బహువచన
ఉపోత్తమేతఉద్భవతి ॥ టీక ॥ బహువచనే బహువచ
నముపరమగునపుడు ఇదుపోత్తమోత్తమానామ్ - ఇ
త్ - ఇకారము - ఉపోత్తమ - ఉపోత్తమముగా - ఉత్త

మూనామ్ - ఉత్తమముగాఁ గలిగిన శబ్దముల యొక్క - ఉపోత్తమేతః ఉపోత్తమ మయిన యికారమునకు - ఉత్ - ఉకారము - భవతి - అగుచున్నది - అనఁగాని కారంబుపాంత్యవర్ణము నంత్యవర్ణమును గాఁ గలిగిన శబ్దంబులకు బహువచనము పరంబగునపుడు పాంత్యంబయిన యికారంబునకు కారాదేశంబు వచ్చునని తాత్పర్యము. ఉ - బలిమి - బలుములు - కలిమి - కలుములు - చెలిమి - చెలుములు - ములికి - ములుకులు - ఇత్యాదులు.

౩౭ ॥ మూ ॥ అస్మద్యుష్మద్భ్యాం చ్యాదేకత్వ ఇతో నివీ ॥

టీక ॥ ఇతః - ఇకారాంతములైన అస్మద్యుష్మద్భ్యాం చ్యాత్ - అస్మద్యుష్మదర్థములకంటెఁ బరముగా - ఏకత్వే - ఏకవచనమందు - నివీ - నివియనునవి - స్తః - అగుచున్నవి - అనఁగా నికారాంతంబులైన దేశ్యాస్మద్యుష్మచ్ఛబ్ద విశేషణముల యేకవచన మందుఁ గ్రమముగా నివియనువర్ణకములు వచ్చునని తాత్పర్యము - ఉ - నే

నగవిని - నీవు కవివి - నేను దండ్రిని - నీవు తల్లివి - ఇత్యాదులు.

౩౭ ॥ మూ ॥ పరే షాంతు ధర్మోత్తమ మధ్యమవత్ ॥ టీక ॥ పరేషాంతు ఇతరములకైతే - ధర్మోత్తమ మధ్యమవత్ - ధర్మ - తద్ధర్మార్థకము యొక్క - ఉత్తమ మధ్యమ వత్ - ఉత్తమ పురుష మధ్యమపురుషములకువలె - స్యాత్ - అగును - అనఁగా నికారాంత వ్యతిరిక్తములయినయస్మచ్ఛబ్దవిశేషణములకేకవచనమందుఁ దద్ధర్మార్థకక్రియాపదోత్తమపురుష మునకువలెను - వర్ణకంబునుయుష్మచ్ఛబ్దవిశేషణంబులకేకవచనమందుఁదద్ధర్మార్థక మధ్యమపురుషంబునకువలె పువర్ణకంబునువచ్చునని తాత్పర్యము - ఉ - నేను భక్తుఁడను - నీవు దేవుఁడవు ఇత్యాదులు-

౩౮ ॥మూ॥ బహుషునమధ్యవత్ ॥ టీక॥ బహుషు॰ బహువచనములందు - మధ్యవత్ - మధ్యమపురుషమునకువలె - న - లేదు - అనఁగా నస్మచ్ఛబ్దవిశేష



# సటీకాన్ధ్రశబ్దచిన్తామణి.

ులబహువచనమునందుఁదద్ధర్మోత్తమ పురుష బహువచనమునకువలెమువర్ణకమునుయుష్మచ్ఛబ్దవిశేషణబహువచనమందుఁదద్ధర్మప్రథమపురుషమునకువలెరువర్ణకంబును వచ్చునని తాత్పర్యము - ఉ - మేము భక్తులము - మీరు పోషకులరు - మేము కవులము - మీరు కవులరు - ఇత్యాదులు.

౩౯ ॥ మూ ॥ ఉతోచ్చ సర్వేషు ॥ టీక ॥ సర్వేషు - అన్నియుఁబరములగునపుడు - ఉతః - ఉకారమునకు అచ్చ అకారమును - స్యాత్ - అగును అనఁగాను ముపురు వర్ణకములు పరములగునపుడు వాని యుకారంబునకకారాదేశంబు వచ్చునని తాత్పర్యము - ఉదాహరణము మున్న చెప్పఁబడియె - సర్వేషు అనుటచేతఁ గ్రియాపదంబులయందు కారంబునకునకారంబు వచ్చును ఉ-జయించుచున్నాఁడను. జయించుచున్నాఁడవు ఇత్యాదులు-

౪౦ ॥ మూ ॥ సర్వవిభక్తిస్సంస్కృతతుల్యా ॥ టీక సర్వవిభక్తిః. సమస్తవిభక్తి సంస్కృతతుల్యస

సంస్కృత సమాసము గా - స్యాత్ - అగును - అనఁగా సంస్కృతమందేయేయర్థంబులయందే యేవిభక్తి వచ్చునో తెనుఁగు నందునాయాయర్థంబులయందా యావిభక్తి వచ్చునని తాత్పర్యము. ఉ సీత సర్వోత్తమురాలు - ప్రాతిపదికార్థమునఁ బ్రథమ. సీత సువలఁ జెన కర్మార్థమున ద్వితీయ. సురలచేత నుతింపఁ బడియె - కర్త్రర్థమునఁ దృతీయ. ఖడ్గము చేత నఱికె కరణార్థమునం దృతీయ. దయచేత రక్షించె. హేత్వర్థమునం దృతీయ. నాకొఱకిచ్చె - సంప్రదానార్థమునఁ జతుర్థి. ప్రయాగము వలనం గాశికిం బోయె. అపాదానార్థమునఁ బంచమి - నీ వలన బ్రదికితి హేత్వర్థమునఁ బంచమి రాముని దాసుఁడు సంబంధార్థమునఁ షష్ఠి. జగములకుఁ గర్త, కర్త్రర్థమున షష్ఠి. వైకుంఠమందుండె అధికరణమున సప్తమి. ఇత్యాదులు.

౪౧ ॥ సూ ॥ అన్యస్యాః క్వచిద్వేచ్ఛాన్యా ॥ టీక ॥ క్వచిత్ ఒకానొకచోట. అన్యస్యాః - మఱియొకవిభ

త్రికి. అన్యాచ - మఱియొకవిభక్తియు - భవేత్ - అగును - అనఁగాఁ దెనుఁగునందుఁగొన్ని యొకలమఱి యొకవిభక్త్యర్థమందు. మఱియొకవిభక్తి యువచ్చునని తాత్పర్యము - ఉ - సీత నాకువరమిచ్చె - ఇచటఁజతుర్థ్యర్థంబునందుషష్ఠి. శిరమున గురుపాదుకలవహించి ఇచటఁదృతీయార్థమందు - సప్తమి - సుఖముండె ఇచటఁదృతీయార్థమందుఁబ్రథమ. ఇత్యాదులు.

శ-౨॥ సూ॥ ఏకత్వం భేదక గతబహువచనానాంచ దృశ్యతే కృతౌ ॥టీక॥ కృతౌ. ఆంధ్రమందు - భేదకగతబహువచనానామ్ - భేదకగత. విశేషణమున్నుబొందిన - బహువచనానామ్ - బహువచనములకు. ఏకత్వంచ. ఏకవచనమును - దృశ్యతే. కానఁబడుచున్నది. అనఁగాఁదెనుఁగునందువిశేషణగతములైనబహువచనములకేకవచనమును వచ్చుచున్నదని తాత్పర్యము - ఉ - ఇంపయినపలుకులు సొంపయిన సిరులు ఇష్టమగు పదార్థములు ఇత్యాదులు.

౭౩॥ సూ॥ ద్విగుకర్మధారయాతత్పురుషద్వన్ద్వాబ
హువ్రీహిః, అన్యేచ కేచిదుపమానోత్తరపదలోపరూ
పకాఖ్యాద్యాః - పరిదృశ్యా ఇహ ॥ టీక ॥ ఇహ ' ఈ
యాంధ్రమందు . ద్విగుకర్మధారయా . ద్విగు . ద్విగు
సమాసము కర్మధారయా . కర్మధారయసమాసము -
తత్పురుషద్వన్ద్వా . తత్పురుష - తత్పురుషసమాసము
ద్వన్ద్వా . ద్వంద్వసమాసము . బహువ్రీహిః . బహు
వ్రీహిసమాసము . ఉపమానోత్తరపదలోపరూప
కాఖ్యాద్యాః - ఉపమాన - ఉపమానసమాసము .
ఉత్తరపదలోప . ఉత్తరపదలోపసమాసము . రూప
కాఖ్య రూపకసమాసము, ఆద్యాః - మొదలుగాఁ
గల - అన్యేచ - ఇతరసమాసములును . కేచిత్ . కొ
న్ని - పరిదృశ్యాః . చూడఁదగినవి_అనఁగాఁ దెనుఁగు
నందు ద్విగుసమాసంబును కర్మధారయసమాసంబును
దత్పురుషసమాసంబును ద్వంద్వసమాసంబును బహు
వ్రీహిసమాసంబును ఉపమానసమాసంబును తత్

పదలోప సమాసంబును రూపక సమాసంబును మొద
లుగాఁగల సమాసంబులు దెలియఁదగినవియని తాత్ప
ర్యము. ఉ - ముచ్చిచ్చు - ముజ్జన్నె. ముక్కోక ఇత్యా
దులు ద్విగు సమాసంబులు నల్లగువ. తెల్లదమ్మి. క
ఱుకుటమ్ములు - ఇత్యాదులు కర్మధారయములు - మ
న్నెపువ్వు. దొంగయిలుకు - కోకచెఱఁగు. ఇత్యాదులు
తత్పురుష సమాసంబులు. తల్లిదండ్రులు. అన్నదమ్ము
లు. కాలుసేతులు. ఇత్యాదులు ద్వంద్వ సమాసంబు
లు అలుకఁజిల్కులుఁకు సెలువ వేఁడివెలుఁగు ఇత్యా
దులు బహువ్రీహి సమాసంబులు. కేలుదమ్మి చెక్కు
టద్దము. ఇత్యాదులుపమాన సమాసంబులు. జవ్వా
ది సెట్టి ' చనుపాలరాచక్క. ఇత్యాదులుత్తర పద
లోప సమాసంబులు కన్నుఁగలువ. కౌనువీన్నె.
ఇత్యాదులు రూపక సమాసంబులు. ఆర్య శబ్దము చేత
రాచసింగము. ఇత్యాదులైనయుపమానోత్తర పద స
మాసములును గ్రహింపఁబడు.

# హలంతపరిచ్ఛేదము.

౪౪॥ సూ॥ కార్యా ఔపవిభక్తికవదన్త విధయశ్చ॥ టీ॥

ఔపవిభక్తికవత్ ఔపవిభక్తికములవలె - అన్తవిధయశ్చ - సమాసాంతవిధులును - కార్యాః - చేయఁదగినవి అనఁగా సమాసాంత ప్రత్యయవిధులు ఔపవిభక్తికములవలె జేయఁదగినవియని తాత్పర్యము. ఉ - అలఘువిల్లుఁడు అనుచోటఁ ఢకారంబు - వాలుగంటికి - అనుచోటఁబిందుపూర్వకటికారంబు - తమ్మిచూలి - అనుచోఁ ణికారంబు నలువ - అనుచోట హ్రస్వంబు - ఇత్యాదులు.

౪౫॥ సూ॥ లోపశ్చవిభక్త్యాదేశ్శబ్దేషుస్యాత్సమాసకాఙ్గేషు॥ టీక॥ సమాసకాఙ్గేషు - సమాసక సమాసకములకు - అఙ్గేషు - అవయవములైన - శబ్దేషు - శబ్దములయందు విభక్త్యాదేః విభక్తిమొదలయిన దానికి - లోపశ్చ - లోపమును - స్యాత్ - అగును - అనఁగా సమాసకావయవములైనశబ్దంబులయందువిభక్తిమొదలయినదానికిలోపము వచ్చునని తాత్పర్యము.

ఉ - వేల్పు - దొర - రాచకొమరుఁడు - ఇత్యాదులు - ఆదిపదముచేతఁదమ్మికంటి - ఇత్యాదులయం దుపమావాచకలోపంబును జవాది సెట్టి ఇత్యాదులయందుత్తరపదలోపంబును చకారమువలన - వేల్పులచెట్టు - మావులతోట - ఇత్యాద్యలుక్సమాసంబులును గ్రహింపఁబడు.

౮౬ ॥ మూ॥ కేవలవికృతిపదైర్య స్సమాసకం తం బ్రువన్తి వాక్యజ్ఞాః॥ టీక॥ వాక్యజ్ఞాః పండితులు - యః - ఏ సమాసము - కేవలవికృతిపదైః - శుద్ధాంధ్రపదములతోఁగూడినదో - తమ్ - దానిని సమాసకమ్ - సమాసకమునుగా - బ్రువన్తి - చెప్పుచున్నారు - అనఁగా వ్యాకరణజ్ఞులు కేవలాంధ్రపదములతోఁ గూడిన సమాసమును సమాసకమని చెప్పుచున్నారని తాత్పర్యము - ఉ - నిండుపున్నమనాఁటిజాబిల్లివెన్నెలతేట - తియ్యని క్రొంబిన్నాకతోటనీటు - ఇత్యాదులు.

హలంతపరిచ్ఛేదము.

౪౭ ॥ సూ ॥ సంస్కృతవైకృతశబ్దైర్మిశ్రసమాసస్స ఏవ విజ్ఞేయః ॥ టీక ॥ యః - ఏ సమాసము - సంస్కృత వైకృతశబ్దైః - సంస్కృతాంధ్రశబ్దములతోఁ గూడినదో - స ఏవ - అదే మిశ్రసమాసః - మిశ్రసమాసముగా - విజ్ఞేయః - ఎఱుఁగఁదగినది - అనఁగా సంస్కృతాంధ్ర పదములతోడఁ గూడిన సమాసంబెద్దిగలదో యది యమిశ్రసమాసం బని తాత్పర్యము - ఉపస్కార కరపుఁ దావి చెలువు పాలకడలి పట్టిరామ శ్రీయకము - సర్వైశ్వర్యలక్ష్మి నెళవు - ఇత్యాదులు.

౪౮ ॥ సూ ॥ సంస్కృతపదేన పరిమితమాంధ్ర పదం కర్మధారయో భవతి ॥ టీక ॥ పరిమితమ్ - స్వల్పమైన - ఆంధ్ర పదమ్ - తెనుఁగుపదము - సంస్కృతపదేన - సంస్కృతపదముతోఁ గూడి - కర్మధారయః - కర్మధారయసమాసముగా - భవతి - అగుచున్నది - అనఁగా స్వల్పమైన తెనుఁగుపదము సంస్కృతపదముతోఁ సస్యా సింధి కర్మధారయ సమాసముగా నగునని తాత్పర్య

[illegible] . ఉ- వాఁడిమయూఖములు . వేఁడిపయోధార
లుకలికిభుజంగకన్యకలు - ఇత్యాదులు - ఇచటషష్ఠ్యల్ప
త్వముషడ్వర్గపర్యంతమనియెఱుఁగునది-

౪౯ ॥ మూ ॥ స్వస్వవిభక్తివికారైర్బహవశ్శబ్దా యథాతథం
సమస్యన్తే ॥ టీక ॥ బహవశ్శబ్దాః - అనేకపదములును -
స్వస్వవిభక్తివికారైః స్వస్వ - తమతమయొక్క
విభక్తివికారైః విభక్తివికారములతోడ . యథాత
థం . యథాయోగ్యముగా సమస్యన్తే - సమాసము
లగుచున్నవి - అనఁగా ననేకంబులైన సంస్కృతశబ్దం
బులు దెనుఁగుశబ్దంబులతోడ . దెనుఁగుశబ్దంబులు సం
స్కృతశబ్దంబులతోడ యథేష్టముగా దమతమవిభక్తి
వికారములతో సమసించుచున్నవని తాత్పర్యము . ఉ-
తెలిదమ్మికంటి గేహిని . పుట్టింటిసంపత్తిపెంపు . క
లువకంటి . కటాక్షంపుగుంపులు ఇత్యాదులు.

౫౦ ॥ మూ ॥ ఇతి శ్రీసకలభాషావాగనుశాసననన్న
యభట్టవిరచితాన్ధ్రశబ్దచిన్తామణౌ చతుర్థోల్లాసస్సప

రిచ్ఛేదః ॥ టీక ॥ శ్రీసకలభాషావాగనుశాసనుండగుచు న్న యభట్టారకునిచేత విరచింపఁబడిన యాంధ్రశబ్దచిం తామణియందు నాలవదియైన హలంత పరిచ్ఛేదము ము గిసె

---

## క్రియాపరిచ్ఛేదము.

---

౧ ॥ సూ॥ ఉపకృతి పరిణతి సంవృతి భేదా త్త్రివిధా క్రియా ॥ టీక ॥ క్రియా క్రియ. ఉపకృతిపరిణతిసం వృతిభేదాత్ - ఉపకృతిపరిణతిసంవృతిభేదము వలన. త్రివిధా మూఁడుగులుగలది స్యాత్ - అగును. అనఁ గాఁ క్రియయనునుపకృతియని పరిణతియని సంవృతియని మూఁడువిధములుగలది యగునని తాత్పర్యము

౨ ॥ సూ ॥ పుష శబ్దాదిరుపకృతిః ॥ టీక ॥ ఉపకృతిః. ఉపకృతిక్రియ పుషశబ్దాదిః - పుషధాతువుఁబు ధాతువు మొదలుగాఁ గలది స్యాత్. అగును - అనఁగా

సూపకృతిక్రియపుషపుష్టాణుస్తుతా ఇది మొదలు గాఁగ
లదియని తాత్పర్యము.

౩ ॥మూ॥ అథభూజ్యాదిఃపరిణతిః॥టీక॥ అథ పిమ్మ
ట - పరిణతిః పరిణతిక్రియ - భూంజ్యాదిః - భూధాతు
వుజిధాతువు మొదలుగాఁగలది - స్యాత్ - అగును అ
నఁగాఁబరిణతిక్రియభూసత్తాయాంజిజయే ఇది మొద
లుగాఁగలదియని తాత్పర్యము

౪ ॥ మూ ॥ అన్యాతురంజీవస్యాదిః॥టీక॥ అన్యాతు -
సంవృతిక్రియయైతే - రజ్జీవస్యాదిః - రంజిధాతువువ
స ధాతువు మొదలుగాఁగలది - స్యాత్ - అగును - అ
నఁగాసంవృతిక్రియరఞ్జీరాగేవసనివాసే ఇది మొదలు
గాఁగలదియని తాత్పర్యము.

౫॥ మూ॥ స్యాదుపకృతిఃకృదన్తా॥టీక॥ ఉపకృతిః -
ఉపకృతి క్రియ - కృదన్తా - కృత్ప్రత్యయాంతముగా.
స్యాత్ - అగును- అనఁగా నుపకృతిక్రియ ఘఞ్ క్తి
మొదల యినకృత్ప్రత్యయమంతమందుఁగలదయై ప్ర

కృతియగు నని తాత్పర్యము - ఉ - పోష - నతి [illegible]
అనుమతి - సంతోష - రోష - మోహ - ఛేద - భేద
ఃరోధ - ఇత్యాదులు-

౬ ॥మూ॥ సాపరిణతిరయవరన్వితైవభవేత్ ॥టీక॥
సాపరిణతిః ఆపరిణతి క్రియ - అయవర న్వితైవ. అ
య్ అవ్ అర్ అను వానితోఁ గూడినదిగానే - భవేత్
అగును. అనఁగాఁబరిణతిక్రియ అయ్ అవ్ - అర్ అను
వర్ణములతోడఁ గూడి - య ప్రకృతియగున నితాత్పర్య
ము - ఉ - జయ్ - తయ్ - సంశ్రయ్ అను భవ్ ప
రిభవ్ - అప న్వావ్ - భర్ - వర్ - హవ్ - ఇత్యాదులు.

౭ ॥ మూ ॥ సంవృతిరహతాకారా॥టీక॥ సంవృతిః -
సంవృతిః క్రియ అహతాకారా అహత - అనాదిష్ట
మైన ఆకారా ఆకారముగలదిగా భవేత్ అగును-
అనఁగా సంవృతి క్రియయుపదేశకాలమందుసిద్ధమైన
స్వరూపముతోఁగూడినదై ప్రకృతియగు నని తాత్పర్య
ము ఉ - రంజ - వస - అర్థ - ఖచ - గవ్ష గణ-
ఠండ - భజ, ఇత్యాదులు.

# సటీకాన్ధ్రశబ్దచిన్తామణి.

౭ ॥మూ॥ జ్ఞేయం త్రివిధాసు చ క్రియాస్వేవమ్ ॥టీ॥ త్రివిధాసు - త్రివిధములైన - క్రియాసుచ - క్రియలయందు - ఏవమ్ - ఇట్లు - జ్ఞేయమ్ - పఱుఁగునది అనఁగా నువక్ష్యాదిభేదములవలన ముత్తెఱంగులుగల క్రియలయందు త్రెఱంగునలక్షణంబెఱుంగఁ దగినది యని తాత్పర్యము.

౮ ॥మూ॥ తద్ధర్మవర్తమానాతీతాగామ్యర్థకాః క్రియాః జ్ఞేయాః ॥టీక॥ క్రియాః - క్రియలు - తద్ధర్మవర్తమానాతీతాగామ్యర్థకాః - తద్ధర్మ - తద్ధర్మము - వర్తమాన - వర్తమానము - అతీత - భూతము - ఆగామి భవిష్యత్తు అర్థకాః - అర్థములుగలవిగా - జ్ఞేయాః - తెలియఁదగినవి - అనఁగా క్రియలు తద్ధర్మార్థకవర్తమానార్థకభూతార్థకభవిష్యదర్థకములని నాలుగు విధములుగలవిగా నున్నవని తాత్పర్యము - తద్ధర్మమనఁగా భూతాద్యర్థత్రయవిలక్షణమైనయొండొకయర్థవిశేషము -

౧౦ ॥ మూ ॥ తత్రద్వితీయ తుర్యౌ యాతౌ స్తస్సా
బనకావేవ ॥ టీక ॥ తత్ర - వానియందు - యా - వని
ద్వితీయతుర్యౌ. ద్వితీయ రెండవదియు - తుర్యౌ-నా
లుగవదియు. నూ - తౌ - అవి - సానుబన్ధకావేవ అ
నుబంధముతోఁ గూడినవిగానే - స్తః అగుచున్న వి. అ
నఁగాఁ దద్యగ్యాద్ధికాదిక్రియలయందు రెండవది నాలుగ
వదియుగువర్తమానార్థకభవిష్యదర్థకములను బంధస
హితములుగానే యుండునుగాని నిరనుబంధములుగా
నుండవని తాత్పర్యము.

౧౧ ॥ మూ ॥ వసతిరనుబన్ధకః స్యాద్యత్రలడర్థోవివ
క్షితస్తత్ర ॥ టీక ॥ యత్ర - ఎచ్చట లడర్థః - వర్తమానా
ర్థము, వివక్షితః - వివక్షితమో - తత్ర అచ్చట - వ
సతిః - వసధాత్వర్థము - అనుబన్ధకః అనుబంధకము
గా స్యాత్ - అగును - అనఁగాఁ గ్రియాపదంబునకె
చ్చటవర్తమానార్థంబు వివక్షితంబగునో యచ్చట వస
ధాత్వర్థమైనయున్నయనుశబ్దంబనుబంధకంబగునని తా
త్పర్యము.

# సటీకాన్ధ్ర శబ్దచిన్తామణి.

౧౨ ॥ మూ ॥ అస్తిరనుబన్ధకస్స్యాద్యత్రల్పృడర్థోవివక్షితోధాతోః ॥ టీక ॥ యత్ర - ఎచ్చట - ల్పృడర్థః - భవిష్యదర్థము - వివక్షితః వివక్షితమో తత్ర - అచ్చట - ధాతోః - ధాతువు మీఁద - అస్తిః - అసధాత్వర్థము - అనుబన్ధకః - అనుబంధకముగా - స్యాత్ - అగును - అనఁగాఁ గ్రియకెచ్చటభవిష్యదర్థము- వివక్షితంబగునోయచ్చటనసధాత్వర్థమైన కలయను శబ్దంబనుబంధకంబగునని తాత్పర్యము.

౧౩ ॥ మూ ॥ భవతిక్రియాపదానాంత్రివిధానామించుగాగమః ॥ టీక ॥ త్రివిధానామ్- ముత్తెఱంగులుగల క్రియాపదానామ్ - క్రియాపదములకు ఇంచుగాగమః ఇంచుగాగమము - భవతి అగుచున్నది - అనఁగా సే పక్కృత్యాదిభేదములవలనఁ ద్రివిధములైన క్రియాపదములకు స్వార్థమందించుగాగమంబు వచ్చునని తాత్పర్యము- ఈయాగమము కిత్తుగావున నంత్యావయవంబుగా వచ్చు.

౧౪॥ మూ॥ ణేశ్చ॥ టీక॥ ణేశ్చ - ణ్యంతమునకును ఇంచుగాగమః - ఇంచుగాగమము - భవతి - అగుచున్నది. అనఁగా హేతుమతి చ అనుసూత్రముచేత నెచ్చటఁ జ్ఞిచ్ప్రత్యయంబు విధింపఁబడినదో యచ్చట నించుగాగమంబువచ్చునని తాత్పర్యము - ఈయర్థమందు దేశ్యక్రియలకునీయాగమంబువచ్చు.

౧౫॥ మూ॥ అనుబన్ధప్రార్థనయోర్ణౌ వ్యతిరేకాదికే చ చోః పస్స్యాత్॥ టీక॥ అనుబన్ధప్రార్థనయోః. అనుబంధప్రార్థనార్థములందును - ణౌ. ణిజర్థమందును · వ్యతిరేకాదికే చ - వ్యతిరేకాద్యర్థమందును, చోః - చువర్ణమునకు · పః. పకారము. స్యాత్ - అగును - అనఁగానను బంధకము పరంబగునప్పుడును ప్రార్థనార్థము పరంబగునప్పుడును ణిచ్చు - రంబగునప్పుడును వ్యతిరేకార్థము పరంబగునప్పుడు నాపైనయుచేత నిముమున్న ర్థకస తిసప్తమ్యర్థకములు పరములగునప్పుడు నింమచ్చును సంబంధియగుచువర్ణంబునకుఁబకారా

**[illegible]ము** వర్తమానార్థకమునకుదాహరణము.
**పుష్** అను ధాతువుమీఁద ఘుఇష్ణు రాఁగాఁ బోష అని రూ
పితంబు - ఇంచుగాగమంబు - పోషించు - చురితీత్యాది
సూత్రము చేతఁ జువర్ణకము - పోషించుచు - వసతీత్యా
దిసూత్రము చేత ఉన్నానుబంధకము - పోషించుచు
న్న - అనుబన్ధప్రార్థనమోరి త్యాదిసూత్రము చేతఁబ
త్వము - పోషింపుచున్న - వ్యతిరేకార్థేల్పటిపటీ త్యాది
సూత్రము చేత డువర్ణకము పోషింపుచున్నఁడు - వ
ర్ణాగమోపి శేషః అనుసూత్రము చేత దీర్ఘము పోషిం
పుచున్నాఁడు ఇట్టు సహింపుచున్నాఁడు - జయిం
పుచున్నాఁడు - అనుభవింపుచున్నాఁడు - భరింపు
చున్నాఁడు - వసింపుచున్నాఁడు - ఇత్యాదులు. ఇ
చటఁ గొందఱు చువర్ణవ్యవధానము చేత నున్నానుబంధ
కము నిరవకాశమగునప్పుడించుగాగమసంబంధియగుచు వర్ణం
బునకుఁ బాదేశంబు లేదని వక్కాణింతురు. ఉ. పోషిం
చుచున్నాఁడు, సహించుచున్నాఁడు, జయించుచు

# క్రియాపరిచ్ఛేదము

నాఁడు - ఇత్యాదులు - త్రివిధానాం [illegible]
దేశ్యక్రియలకు స్వార్థమందించుగాఁగముంబు[illegible]
కొట్టుచున్నాఁడు- గ్రుమ్మచున్నాఁడు. ఇత్యాదులు.
భవిష్యదర్థకమునకుదాహరణము - పోషించు అని
యుండఁగాఁగలానుబంధంబు. పోషించుకల - అను
బంధము పరంబగుటచేతఁ బత్వమును వ్యతిరేకాదావి
త్యాదిపత్యమానసూత్రముచేతనత్వంబునువ్యతిరేకా
ర్థేల్పటీత్యాది సూత్రముచేత డువర్ణకమును రాఁగాఁ
పోషింపఁగలఁడు - ఇట్లునుతింపఁగలఁడు - జయింపఁగ
లఁడు. కొట్టఁగలఁడు- గ్రుమ్మఁగలఁడు ఇత్యాదులు.
ప్రార్థనార్థకమునకుదాహరణము పోషించు ఏక
త్వేథేత్యాదిసూత్రముచేత నేకవచనమందుమువర్ణకం
బును బహువచనమందు డువర్ణకంబును అనుబన్ధప్రా
ర్థనయోరిత్యాదిసూత్రముచేతఁబత్వంబును రాఁగాఁ
పోషింపుము. పోషింపుఁడు - నుతింపుము - నుతింపుఁ
డు - గ్రుమ్మము. గ్రుమ్మఁడు. ఇత్యాదులు - ణిజ

# క్రియాపరిచ్ఛేదము.

పోషించువాడు - పోషింపించువాడు. మ్రొక్కువాడు - మ్రొ
క్కించువాడు - పోషింపక - పోషింపింపక - మ్రొక్కక -
మ్రొక్కింపక - పోషింపనగువాడు - మ్రొక్కనగువాడు - వా
రలును శింపగిరి యొత్తెఁ గృష్ణుఁడు - పోషింపఁగలఁడు -
మ్రొక్కఁగలఁడు - ఇత్యాదులు.

౧౭॥ మూ॥ క్త్వాభూతయోః క్రియాన్తస్యేత్ ॥టీక॥ క్త్వా
భూతయోః - క్త్వార్థభూతార్థములయందు. క్రియాన్త
స్య - ధాత్వంత్యవర్ణమునకు. ఇత్ - ఇకారము - స్యా
త్ - అగును. అనఁగాఁ క్త్వా ప్రత్యయార్థమందును
భూతార్థమందును క్రియాంత్యవర్ణమునకి కారాదేశం
బగునని తాత్పర్యము - ఉ. పోషించి - పోషింపిం
చి - మ్రొక్కి - మ్రొక్కించి - పోషించిరి పోషించితి
వి - పోషించితిరి - పోషించితిని పోషించితిమి. మ్రొ
క్కిరి - మ్రొక్కితిని ఇత్యాదులు.

౧౮॥ మూ॥ ప్రథమైకవచనలోప స్తస్య స్తాతీతయోః
క్రియాణాంస్యాత్ ॥టీక॥ క్రియాణామ్ - క్రియలకు.

[illegible] - తద్ధర్మార్థభూతార్థములందు - ప్రథమైకవచనలోపః ప్రథమైకవచన- ప్రథమపురుషైకవచనమునకు లోపః - లోపము స్యాత్ - అగును అనఁగాఁ దద్ధర్మార్థమందును భూతార్థమందును క్రియాపదంబుల ప్రథమపురుషైకవచనంబునకు లోపంబు వచ్చునని తాత్పర్యము - ఉ - పోషించున్ . మ్రొక్కున్ - పోషించెన్ - మ్రొక్కెన్ - ఇత్యాదులు.

౧౭ ॥ సూ ॥ వ్యతిరేకార్థే లృటిలటిడుజ్వా స్యాత్ ॥ టీ॥ వ్యతిరేకార్థే - వ్యతిరేకార్థమందును - లృటి . భవిష్యదర్థమందును . లటి - వర్తమానార్థమందును - డుజ్ . డువర్ణకము - స్యాత్ . అగును - అనఁగా వ్యతిరేకార్థమందును భవిష్యదర్థమందును వర్తమానార్థమందును క్రియాపదంబుల ప్రథమపురుషైకవచనంబునకు డువర్ణకంబు వచ్చునని తాత్పర్యము . ఉ . పోషింపఁడు . మ్రొక్కఁడు. పోషింపఁగలఁడు - మ్రొక్కఁగలఁడు పోషించుచున్నాఁడు - మ్రొక్కుచున్నాఁడు - ఇత్యాదులు -

౨౦ ॥ మూ ॥ స్యృ రేఫునద్యుదీభవతః ॥ టీక ॥

రేఫునః - స్వృ ర్ణంబుదైతే - ద్యుదీ - మది వర్ణకములు -
భవతః - అగుచున్నవి అనఁగా - స్వృ ర్ధంబునవ్యతి
రేకారకభవిష్యదర్థకప్రథమపురుషైకవచనమునకు
ము వర్ణకంబును వర్తమానార్థకప్రథమపురుషైకవచన
మునకు దివర్ణకంబును వచ్చునని తాత్పర్యము ఉ. కాం
త పోషింపను - క్రొక్కెదు - పోషింపఁగలదు - క్రొ
క్కఁగలదు - పోషించుచున్నది - క్రొక్కుచున్నది - ఇ
త్యాదులు -

౨౧ ॥ మూ ॥ అన్యస్మాచ్చాధాతో ర్ధాతుత్వవివక్షా
యామేవభవతీంచుక్ ॥ టీక ॥ అధాతోః - ధాతువుకాని -
అన్యస్మాచ్చ - ఇతరశబ్దము మీఁద ను - ధాతుత్వవివక్షా
యామేవ - ధాతుత్వ - ధాతువగుటయొక్క - వివక్షాయామేవ
చెప్పనిచ్ఛచేతనే ఇంచుక్ - ఇంచు గాగమము - భవతి
అగుచున్నది - అనఁగా ధాతుభిన్నంబయిన యుజియొక
శబ్దంబుమీఁద ధాతుత్వమును వివక్షించు నప్పుడించు గాగ

మరులవచ్చునని తాత్పర్యము. ఉ. పల్లవించె - అస్త
మించె. అప్పగించె. తల్లడించె. ఇత్యాదులు.

౨౨॥ మూ॥ తిర్యగ్జడేషుకర్తృషుబహువచనం చైక
వచనమేవ స్యాద్భూతేతద్ధర్మేచ॥ టీక॥ భూతే - భూ
తార్థమందును - తద్ధర్మేచ - తద్ధర్మార్థమందును - తిర్యగ్జ
డేషు - తిర్యగ్జడములు - కర్తృషు - సత్సు - కర్తలగుచుం
డఁగా - బహువచనమ్ - బహువచనము - ఏకవచన
మేవ - ఏకవచనంబ - స్యాత్ - అగును - అనఁగా
భూతతద్ధర్మార్థములయందుఁ బశుపక్ష్యాదితిర్యక్కులు
నచేతనంబులును గర్తలగునపుడు - బహువచనంబేకవ
చనంబేయగునని తాత్పర్యము. ఉ - చిలుకలురంజిల్లె.
చివుళ్లు విలసిల్లె - చిలుకలు రంజిల్లుఁ - చివుళ్లు విలసి
ల్లుఁ - ఇత్యాదులు.

౨౩ ॥ మూ॥ అన్యత్రపుమ్॥ టీక॥ అన్యత్ర - తక్కి
నయర్థంబులయందు. పుమ్ - పుంవర్ణకంబులు - స్తః - అ
గుచున్నవి - అనఁగాఁ దిర్యగ్జడములు కర్తలగునపుడు

# క్రియాపరిచ్ఛేదము.

భూతతద్ధర్మార్థములకంటె నన్యంబులగు వ్యతిరేకభవిష్యదర్థంబులబహువచనమందువువర్ణకంబునువర్తమానార్థకబహువచనమందువివర్ణకమునువచ్చునని తాత్పర్యము. ఉ - చిలుకలురంజిల్లవు - చివుళ్లువిలసిల్లవు చిలుకలు రంజిల్లఁగలవు చివుళ్లు విలసిల్లఁగలవు-చిలుకలు రంజిల్లుచున్న వి-చివుళ్లు విలసిల్లుచున్న వి-ఇత్యాదులు.

౨౮॥ సూ। స్త్రీవదేక వచనంతు॥ టీక॥ ఏకవచనంతు - ఏకవచనమైతే - స్త్రీవత్ - స్త్ర్యర్థమందువలె - స్యాత్ - అగును - అనఁగాఁ దిర్యగ్జడములకర్తలగునపుడు స్త్ర్యర్థంబునందువలె వ్యతిరేకభవిష్యదర్థకప్రథమపురుషైకవచనంబునదువర్ణకమును వర్తమానార్థకప్రథమపురుషైకవచనమునందిప్వర్ణకమును వచ్చునని తాత్పర్యము. ఉ చిలుక రంజిల్లదు - చివురువిలసిల్లదు - చిలుకరంజిల్లఁగలదు. చివురు విలసిల్లఁగలదు - చిలుకరంజిల్లుచున్నది - చివురువిలసిల్లుచున్నది ఇత్యాదులు.

౨౫ ॥మూ॥ ఉత్వాయుతౌవనకారౌస్యాతాంమధ్యోత్తమైకవచనానామ్॥టీక॥మధ్యోత్తమైకవచనానామ్- మధ్యమపురుషైకవచనోత్తమపురుషైకవచనములకు ఉత్వాయుతౌ, ఉకారముతోఁగూడిన వనకారౌ- వకారనకారములు - స్యాతామ్ - అగును - అనఁగా సమస్తక్రియలయందన్ని యర్థంబులమధ్యమపురుషైకవచనమునకువు వర్ణకమును త్తమపురుషైకవచనమునకు నువర్ణకమునువచ్చు నని తాత్పర్యము - ఉ - పోషించుచున్నావు . పోషించితివి . పోషింపఁగలవు - పోషింపవు - పోషింతువు , పోషించుచున్నాను . పోషించితిని పోషింపఁగలను - పోషింపను - పోషింతును - ఇత్యాదులు

౨౬ ॥మూ॥ సర్వేషాంబహువచనేరు ఇతిస్యాత్॥ టీక॥ సర్వేషామ్ - సమస్తక్రియలయొక్క బహువచనేబహువచనమందు రు ఇతి - రు అనువర్ణకము-స్యాత్ - అగును . అనఁగా సమస్తపురుషంబునఁ దప్పస

## క్రియాపరిచ్ఛేదము.

మస్త క్రియాపదంబుల బహువచనమందు మువర్ణకంబు వచ్చునని తాత్పర్యము ఉ పోషించుచున్నారు పోషించిరి పోషించితిరి పోషింపఁగలరు. పోషింతురు - పోషింపుదురు, పోషించెదరు - ఇత్యాదులు.

౨౭ ॥ సూ ॥ ఉత్తమస్యతు భవేన్మః ॥ టీక ॥ ఉత్తమస్యతు ఉత్తమపురుషమునకైతే - మః - మువర్ణకము భవేత్ - అగును, అనఁగా సమస్త క్రియలయందుత్తమపురుషబహువచనమునకు - మువర్ణకంబువచ్చునని తాత్పర్యము - ఉ - పోషించుచున్నాము - మ్రొక్కుచున్నాము పోషింపఁగలము - మ్రొక్కఁగలము - పోషింపము మ్రొక్కము. ఇత్యాదులు.

౨౮ ॥ సూ ॥ ఏకత్వేథబహుత్వే ముడుజౌ సంప్రార్థనార్థకేషుస్తః ॥ టీక ॥ అథ - పిమ్మట - సంప్రార్థనార్థకేషు ప్రార్థనార్థములయందు ఏకత్వే ఏకవచనమందు - బహుత్వే బహువచనమందు - ముడుజౌ - మువర్ణకడువర్ణకములు - స్తః - అగుచున్నవి - అనఁగా - ప్రార్థనా

ప్రతీకాశ్వ శబ్దచింతామణి.

లో క్రియలయందేకవచనమందుము వర్ణకమును బహువచనమందుడువర్ణకమునువచ్చు నని తాత్పర్యము - ఉ. పోషింపుము - పోషింపుఁడు - మ్రొక్కుము - మ్రొక్కుఁడు - ఇత్యాదులు.

౬౮॥ సూ॥ దౌ చోస్లుక్తదర్థే ॥ టీక॥ తదర్థే - తదర్థా ర్థమందు - దౌ - దువర్ణకము పరముగుచుండఁగా - చోః - చువర్ణమునకు - లుక్ - లోపము - స్యాత్ - అగును - అనఁగాఁ దదర్థార్థమందు దువర్ణకంబు పరమగునపుడించు గాగను సంబంధియగు చువర్ణంబునకు లోపంబువచ్చునని తాత్పర్యము - తత్కారంబు మీఁదఁ జెప్పఁబడఁగలదు . ఉ . పోషింతురు . పోషింతువు . పోషింతును . ఇత్యాదులు - ఈ కార్యంబు వైకల్పికముగా వునపోషింపుదురు . పోషింపుదువు - అనియును రూపంబుగలదు.

౬౯॥ సూ॥ ప్రథమైకస్య న్తు వేచ్ఛ భూతార్థే॥ టీక॥ భూతార్థే . భూతార్థమందు ప్రథమైకస్య . ప్రథమ

పుసు ష్యైకవచనమునకు . ఏత్ . ఏకారము [stain]
అగును. అనఁగా భూతార్థమందుఁ బ్రథమపురుష [stain]
చనాంతక్రియాపదంబునకే కారంబువచ్చునని తాత్పర్య
ము . ఉ - పోషించె - మ్రొక్కె - ఇత్యాదులు - లఘ్వా
దిన్వంత ధాతువునకు యకారంబుతోఁగూడిన యేకారం
బు - ఉ - కనియె - ఇత్యాదులు.

౩౦ ||సూ|| మతివర్ణకౌ క్రమాత్స్తః||టీక|| మతివర్ణకౌ -
మవర్ణకతివర్ణకములు - క్రమాత్ క్రమమువలన . స్తః.
అగుచున్నవి అనఁగాఁ బూర్వసూత్రద్వయమునందు విత
ద్ధర్మే - భూతార్థే అనుపదద్వయమనువర్తించుచున్నది
గావునఁ దద్ధర్మార్థమందు మవర్ణకంబును భూతార్థమం
దు తివర్ణకంబును వచ్చునని తాత్పర్యము - ఉ - పోషిం
తుము పోషింతుము మ్రొక్కుదురు - మ్రొక్కుదుము -
పోషించితివి . పోషించితిరి - మ్రొక్కితివి - మ్రొక్కితిని -
ఇత్యాదులు

౩౧ ||సూ|| నాద్యస్య దేః||టీక|| ఆద్యస్య - మొదటి దై

తద్ధర్మార్థము - యొక్క - ఆదేశః ప్రథమపురుషైకవచనమునకు - న - లేదు - అనఁగా దద్ధర్మార్థక ప్రథమపురుషైకవచనమునందు మువర్ణకంబు లేదని తాత్పర్యము - ఉ - పోషించుఁగాత - మ్రొక్కుఁగాత - ఇత్యాదులు.

3 ~ ॥మూ॥ ద్వయోశ్చ భూతార్థే ॥టీక॥ భూతార్థే - భూతార్థమందు - ద్వయోశ్చ - ఏకవచన బహువచనములకును - న - లేదు - అనఁగా భూతార్థక క్రియాపద ప్రథమపురుషైకవచనబహువచనములయందుఁ దివర్ణకంబు లేదని తాత్పర్యము - ఉ - పోషించె - పోషించిరి మ్రొక్కె - మ్రొక్కిరి. ఇత్యాదులు.

33॥మూ॥ బిన్దుపరస్య తకారో దోస్స్యాత్ ॥టీక॥ బిన్దుపరస్య - బిందువుకంటెఁ బరమయిన - దోః - దువర్ణకమునకు తకారః - తకారము - స్యాత్ - అగును అనఁగా దౌ చోస్లుక్తద్ధర్మే అనుసూత్రముచేతఁ జువర్ణంబు లోపింపఁగా బిందుపరమైన దువర్ణకంబునకుఁ దకారాదేశంబు వచ్చునని తాత్పర్యము - ఉ - పోషింతుము.

పోషింపుచు - ఇత్యాదులు.

3౮||మూ|| భూతామతాం పరే షామిత్ ||టీక|| అను
తత్ - భూతార్థకక్రియాపదముకంటె - పరే షామ్
పరముపైనవర్ణకములయొక్క - ఉతామ్ - ఉకారముల
కు - ఇత్ - ఇకారము - స్యాత్ - అగును - అనఁగా
భూతార్థక క్రియాపదంబుమీఁది - పు - ను - రు - ము
అనువర్ణములయందలి యుకారంబునకికారాదేశంబు
వచ్చునని తాత్పర్యము - ఉ. పోషించిరి. పోషించితివి
పోషించితిరి - పోషించితిని - పోషించితిమి - మ్రొక్కిరి
మ్రొక్కితివి - మ్రొక్కితిరి - ఇత్యాదులు.

3౯||మూ|| లఘ్వేకాక్షరపూర్వక్రియాన్తిమస్యాన
యోర్భవేదిద్వా||టీక|| అనయః - అయంతము గాని - ల
ఘ్వేకాక్షరపూర్వక్రియాన్తిమస్య - లఘు - లఘువై
న - ఏకాక్షర. ఒక యక్షరము - పూర్వ - పూర్వము
గాఁగల - క్రియాన్తిమస్య - ధాత్వంత్యవర్ణమునకు -
ఇత్ - ఇకారము - వా - వికల్పముగా - భవేత్ - అ

గురు అనాగామయంతంబుగానిదియై లఘువయిన యొకయక్షరము పూర్వము సంయుంగల క్రియకంత్యంబైన వర్ణంబునకి కారాదేశంబు వికల్పంబుగా వచ్చునని తాత్పర్యము. ఉ. ఘుటించె - ఘుటియించె - నటించె - నటియించె వసించె. వసియించె ఇత్యాదులు. లఘువనుటవలన - రంజించె - సాధించె. ఇత్యాదులందును పకారాక్షరమనుటవలన - కరుణించె. విహరించె. ఇత్యాదులందును - అనయః - అనుటవలన - జయించె. నయించె ఇత్యాదులందును. ఇకారాదేశంబు లేదు - కొండొకచోటంబ్రాదియోగంబుననగు -ఉ. ఉత్తరించె- ఉత్తరియించె. ఇత్యాదులు,

౩౬ ॥సూ॥ తిఙ్మధ్యనామ కాస్సుర్మధ్యమ పురుషాశ్చయేఽమా న్తాశ్చ॥టీక॥ యే ఏవి - మధ్యమపురుషాశ్చ - మధ్యమపురుష క్రియలును - రమాన్తాశ్చ. రాంతమాంతక్రియలునో. తే - అవి. తిఙ్మధ్యనామకాః తిఙ్మధ్యములను పేరుగలవిగా. స్యుః ఊను. అనఁ

గాముస్మాత్తిఙ్మధ్యంబులు కళలని చెప్పఁబడినవి గాన వాని
యేవియనునాకాంక్షకు చోచ్చేటఁ బ్రసక్తి రాఁగా మధ్యమ
పురుష క్రియాపదములును రాంతమాంత క్రియాపదము
లును తిఙ్మధ్యములని చెప్పఁబడినవి యని తాత్పర్యము -
ఉ - పోషించితివి . పోషించితిరి - పోషించిరి . పోషిం
చితిమి - ఇత్యాదులు.

౨౭॥ మూ॥ చోరాత్మనే పదార్థేగృహ్ణాతా వాగమస్య
వేత్వంస్యాత్ ॥టీక॥ ఆత్మనేపదార్థే . క్రియాఫలకర్తృ
గామితార్థకమైన . గృహ్ణాతౌ - కొను ధాతువు పరము
గున పుడు . ఆగమస్య - ఇంచు గాగమము యొక్క
చోః . చువర్ణమునకు . ఇత్వస్ - ఇకారము వా - వి
కల్పముగా . స్యాత్ . అగును . అనఁగాఁ గ్రియాఫల
కర్తృగామితార్థద్యోతకమగు కొను ధాతువు పరమగు
నపుడించు గాగమసంబంధిచువర్ణమునకికారంబు వికల్పంబుగా నంతా దేశంబగునని తాత్పర్యము . ఉ . పో
షించికొనిరి . పోషించుకొనిరి ఇత్యాదులు . దే

క్య క్రియల యందు స్వార్థేంచు గాఁగ నుము లేదు గావున ధాత్వంతోకారంబున కికారంబు ఉ. మ్రొక్కికొని యు. మ్రొక్కుకొనియు. ఇత్యాదులు.

౩౮ ॥ మూ ॥ రఞ్జిఘుట్యాదీనాం బిన్దోశ్చ స్యాపిలా వుభౌ భవతః ॥ టీక ॥ రఞ్జిఘుట్యాదీనామ్ రంజిఘుట్యాది ధాతువులయొక్క బిన్దోః - సున్నకు - చ స్యాపి. చకారమునకును ఉభౌ - రెండైన లో లకారములు భవతః - అగుచున్నవి. అనఁగా రఞ్జరాగే ఘుట చేష్టాయామిత్యాద్యకర్మ ధాతువులయందు గాఁగ నుసంబంధి బిందు చకారంబులకు రెండు లకారంబులు సంశ్లిష్టంబులై యాదేశంబులగునని తాత్పర్యము - ఉ. రంజిల్లు - ఘుటిల్లు - విస్తరిల్లు - ఇత్యాదులు. ఆరెండు గ్రహణము చేత ద్విత్వాభావములకును ఉ. అవటిల్లు - నివ్వటిల్లు - ఇత్యాదులు - ద్విత్వాభావంబుగఁ బ్రయోగంబులు గలవు - రంజిలు - నివ్వటిలు - ఇత్యాదులు.

౩౯ ॥ మూ ॥ నతుణౌ భవేచ్చలోపోన్యార్థేయోవప్రత్తే

పరేతస్మిన్ ॥ టీక ॥ ణౌ తు - ణిచ్చుపరంబగునపుడైతే
న - లకారాదేశము లేదు - ణ్యర్థే - ణిజర్థమందు - యః -
పయించు గాగమము - వర్తతే - ఉన్నదో - తస్మిన్ - ఆ
యించు గాగమము - పరే సతి - పరముగు చుండఁగా -
లోపశ్చ - స్వార్థేంచు గాగమ లోపమును - భవేత్ -
అగును - అనఁగా రంజతి ఘట్యాదిధాతువులకు ణిచ్చు
పరంబగు నపుడు లకారస్వయాదేశము గలుగదు మఱి
యేమియనిన ణిజర్థేంచు గాగమము పరమగు నపుడు ల
ద్వయాదేశయోగ్యస్వార్థేంచు గాగమలోపంబు గలు
గునని తాత్పర్యము - ఉ- రంజించెమన్ము - ఘటించె స
త్రాస్యము ఇత్యాదులు.

౪౦ ॥ మూ ॥ పురాగమః క్రియాణామ్ ॥ టీక ॥ క్రియా
ణామ్ - క్రియలకు - పునః విశేషముగను - ఆగమః -
ఆగమము స్యాత్ - అగును - అనఁగా క్రియాపదం
బులకు విశేషాగమంబు వచ్చునని తాత్పర్యము . ఉ పో
షించెదరా - పోషించెదిరా - పోషించెదరు - పోషిం

## సటీకాన్ధ్ర శబ్ద చిన్తామణి.

వకము - పోషింపక - పోషింపఁగా - పోషింపఁబడఁగా - పోషించినఁగా - ఇత్యాదులు.

౪౧ ॥ సూ॥ పర్యాప్తో మన్త్రే తు సఙ్కేతః॥ టీక॥ మన్త్రే తు - నామంత్రమందైతే. సఙ్కేతః - సంకేతము. పర్యాప్తిః - పరిపూర్ణము - అనఁగాఁ దత్సమ క్రియలకు - జేయఁదగిన సంకేతంబింతియుతక్కినయంశంబు సంస్కృతంబునందసిద్ధంబని తాత్పర్యము - మరలఁ జెప్పుట దార్ఢ్యప్రదర్శనార్థము.

౪౨ ॥ సూ॥ సంప్రార్థనార్థకాదీత్ ॥ టీక॥ సంప్రార్థనార్థకాత్ - ప్రార్థనార్థకముమీఁద - ఈత్. ఈకారము - స్యాత్ - అగును - అనఁగాఁ బ్రార్థనార్థక క్రియాపదంబుమీఁద నీకారంబు వచ్చునని తాత్పర్యము. ఉ. పోషింపుమీ పోషింపుఁడీ ఇత్యాదులు.

౪౩ ॥ సూ॥ పదాన్తౌ ప్రశ్నలక్షణౌ భవతః॥ టీక॥ పదాన్తౌ - పదాన్త - ఆకారాన్తములు - ప్రశ్నలక్షణౌ. ప్రశ్న అడుగుటయం. లక్షణౌ ద్యోతకములు భవతః-

అగుచున్నవి అనఁగాఁగ్రియాపదంబులమీఁదనేకారౌకారంబులు ప్రశ్నద్యోతకములుగా వచ్చునని తాత్పర్యము. ఉ. నన్నుఁజూచితివే కృష్ణనలిననయన కరుణఁబ్రోచితివా నన్నుఁగంస్వైరి సుబంతంబుమీఁదనువచ్చు - ఉ. ఏమిటికే కృష్ణుఁజూడ నేగితి రాధా. ఇత్యాదులు

౪౪ ‖సూ‖ ఏదోత్తౌవ్యతిరేకాదపిసంప్రార్థనయోరౌ క్రియాణాంస్తః ‖టీక‖ క్రియాణామ్ క్రియలలో పల. వ్యతిరేకాదపి వ్యతిరేకార్థకము మీఁదను. ఏదోత్తౌ - ఏకార ఓకారములు. సంప్రార్థనయోరౌ - ప్రార్థనార్థకములుగా. స్తః - అగుచున్నవి - అనఁగాఁ క్రియాపదంబులలో వ్యతిరేకార్థకముమీఁదనేకారోకారములు ప్రార్థనాద్యోతకములు గావచ్చునని తాత్పర్యము నన్ను రక్షింపవే కృష్ణ నందతనయ. కరుణింపవో యుష్మత్కులిపుట్ట ఇత్యాదులు - అపిశబ్దానవలన సందేహార్థమునందునచ్చు. ఉ. చూచునో మానఁడో. ఇత్యాదులు.

౪౫ ||మూ|| భావేటవర్ణకోన్తే సర్వేషాం చ క్రియాపదానాం స్యాత్ ||టీక|| సర్వేషామ్ - సమస్తములైన క్రియాపదానామ్ - క్రియాపదముల యొక్క - అన్తే - అంతమందు - భావే - భావార్థమున - టవర్ణకః టవర్ణకము - స్యాత్ - అగును - అనఁగా సమస్త క్రియాపదములయంతమందు భావార్థమునఁ డవర్ణకంబువచ్చునని తాత్పర్యము - ఉ - పోషించుట - మ్రొక్కుట - ఇత్యాదులు.

౪౬ ||మూ|| కర్మణ్యనుబన్ధస్స్యాత్ప్రతిధాతుః కర్తృవచ్చ తద్విధయః ||టీక|| కర్మణి - కర్మార్థమందు - ప్రతిధాతుః ప్రతిధాతువు - అనుబన్ధః అనుబంధముగా - స్యాత్ - అగును - తద్విధయః తత్ - దాని యొక్క - విధయః - కార్యములు - కర్తృవత్ - కర్తృర్థకమునకు వలె - స్యుః అగుచున్నవి. అనఁగా క్రియలకుఁ గర్మార్థకంబున ధాతువ్వర్థమయిన పడుశబ్దంబనుబంధమగును దానికిఁ గర్తృప్రయోగమునకు వలె నున్నాను

బంధము మొదలయిన కార్యములు వచ్చు నని తాత్పర్య
ము - ఉ - పోషింపఁబడుచున్నాఁడు - పోషింపఁబడె
ను పోషింపఁబడఁగలఁడు - పోషింపఁబడు - పోషిం
పఁబడఁడు - మొక్కఁబడుచున్నాఁడు - ఇత్యాదులు.

౪౭ ॥ సూ ॥ అత్వాదితత్సమానామివ దేశ్యానాంక్రి
యాపదానాంచ ॥టీక॥ తత్సమానామివ - తత్సమ క్రి
యలకువలె - దేశ్యానామ్ - దేశ్యములైన - క్రియాప
దానాంచ - క్రియాపదములకును - అత్వాది అత్వా
దికార్యము - స్యాత్ - అగును. అనఁగా వ్యతిరేకాదౌ
ఞాఃసీత్యాదిసూత్రము చేతవిధింపఁబడినయకారంబు
మొదలు గాఁగల కార్యములు దత్సమక్రియల కువలె దే
శ్యక్రియలకును వచ్చునని తాత్పర్యము - ఉదాహరణ
ములయ్యెడలఁ జెప్పఁబడెను.

౪౮ ॥ సూ ॥ వర్ణాగమోపి శేషః పురుషేష్వర్థేషు చా
పి వచనేషు ॥టీక॥ పురుషేషు - ప్రథమాదిపురుషముల
యందును - అర్థేషు - వర్తమానాద్యర్థములయందును -
వచనేషు చాపి - ఏకవచనాది వచనముల యందును -

వర్ణాగమః - వర్ణాగమము - విశేషః - విశేషముగా - భవతి అగుచున్నది - అనఁగాఁ బ్రథమపురుషము మొదలగు పురుషములయందు నువర్తమానార్థము మొదలగు నర్థములయందు నేక వచనము మొదలగు వచనములయందు ను వర్ణాగమంబు విశేషంబు గావచ్చు నని తాత్పర్యము - ఉ ఉన్నాఁడు, రాఁడు - గాఁపించె - కాచె కావఁడు కావు ము. పోయె, పోతివి, పంపె - చనియె చనితివి - వినియె - ఁించె - అయ్యె అయిఁని - కాఁడు కమ్ము. కావించె చూచుఁ. చూడఁడు ఇత్యాదులు -

౪౯ ॥ మూ ॥ ఇతి శ్రీసకలభాషావాగనుశాసనసన్నయభట్టవిరచితాన్ధ్రశబ్దచిన్తామణౌ పఞ్చమః క్రియాపరిచ్ఛేదః ॥ టీక ॥ శ్రీసకలభాషానాగనుశాసనుండగు నన్నయభట్టారకునిచేతను రచింపఁబడిన యాంధ్రశబ్ద చింతామణియందేనవదియగు క్రియాపరిచ్ఛేదము ముగిసె -

